# ధ్ధాంజలి



## శ్రీ పరిమి సుబ్బారావు గారు

వీరు గుంటూరులోని హిందూ కాలేజీ హైస్కూలులో 38 సం॥లు హిందీపండితునిగా పనిచేసి పదవీవిరమణ చేసిరి. వీరు పట్టణహిందీప్రేమీమండలి, గుంటూరుకు సంయుక్త కార్యదర్శిగాను, గుంటూరు జిల్లా హిందీ ప్రచారక మండలి కార్యవర్గ సభ్యునిగా, ఆంధ్రసభకు నిధిపాలక మండలి సభ్యునిగా, కేంద్రసభకు వ్యవస్థాపికా సమితి సభ్యులుగా వుండిరి. వీరు దానశీలురు, సేవానిరతి, సక్రియ హిందీ ప్రచారకులు. చక్కని భాషా పండితులు, స్నేహశీలి, నిగర్వి అయిన శ్రీ పరిమి సుబ్బారావుగారు ది 22-12-94న మద్రాసులోని మన కేంద్రసభ ప్రాంగణములో ఆకస్మికముగా మరణించిరి. వీరి మరణము హిందీ ప్రచార ఉద్యమునకు తీరనిలోటు. వీరి ఆత్మకు శాంతిని చేకూర్చమని భగవంతుని ప్రార్థిస్తూ. ఆంధ్రసభ ప్రగాఢ సంతాపమును తెలియచేస్తూ వున్నది.

టెలిగ్రామ్ : హిందీసభ ఫోన్ : 316865

489

# స్రవంతి

## సాహిత్య మాసపత్రిక

జనవరి–1995

సంపాదకులు

శ్రీ వేమూరి ఆంజనేయ శర్మ

శ్రీ ఈమని దయానంద

శ్రీ అన్నదానం శంకరశాస్త్రి

దక్షిణ భారత హిందీ ప్రచార సభ–ఆంధ్ర

ఖైరతాబాద్, హైదరాబాద్–500 004

సంవత్సర చందా 40–00

విడిప్రతి 4–00

Recommended for use in all the Public libraries and School Libraries by the Director of public Libraries, Andhra State, Madras, Vide proceedings sl No. 30/55 dated 6th January-1955.

# ఈ సంచికలో

సంపాదకీయం

# హిందీ అకాడమీ

ఆంధ్రదేశంలో సంగీత, సాహిత్య, లలిత కళా అకాడమీలు తెలుగు విశ్వ విద్యాలయంలో ఇదివరకే కలిపి వేయబడినవి. ఉర్దూ హిందీ అకాడమీలు మాత్రం వేరుగా పని చేస్తున్నవి. ఉర్దూ అకాడమీ నిర్వహణకు ఆంధ్ర ప్రభుత్వం కొంత విరివిగా విరాళాలు అందజేస్తున్నదని పత్రికా ప్రకటనలు వెలువడుతున్నవి. హిందీ అకాడమీకి ప్రతిసంవత్సరం రెండు లక్షల రూపాయలు విరాళముండేది. దానిని ప్రభుత్వం ఐదులక్షలకు పెంచినట్లు ఆనాటి అకాడమీ అధ్యక్షులు ప్రకటించారు. మంచిదే ననుకున్నాము. చాలా కాలం అధ్యక్షులుగానీ, కార్యవర్గం గానీ లేని అకాడమీకి ఆచార్య సుందరరెడ్డిగారు అధ్యక్షులుగా నియమించబడ్డారు. వారు హైదరాబాదు నగరానికి దూరంగా విశాఖపట్టణంలో వుండడం వలన అనుకొన్నంతగా అకాడమీ కార్యక్రమాలు అమలుగాలేదు. అకాడమీ కార్యాలయంలో లక్ష రూపాయలలో అచ్చయిన పుస్తకాలు పడివున్నవనీ, వాటిని అమ్మి వేయడానికి ప్రయత్నం జరుగుతున్నదనీ అన్నారు. కొంత ప్రయత్నం జరిగినా అనుకొన్నంత ఫలితం లభించినట్లు లేదు. ఈ స్థితిలో సంవత్సరం పూర్తికాగా అకాడమీ అధ్యక్షుణ్ని కార్యవర్గాన్ని ప్రభుత్వం వారు మార్చి వేశారు. శ్రీ బాలశౌరిరెడ్డి గారు అధ్యక్షులుగా నియమింపబడ్డారు. కొత్త కార్యవర్గం గూడా నియమించబడినది. శ్రీ బాలశౌరిరెడ్డిగారు ఒకటి రెండు కార్యవర్గ సమావేశాలు జరిపించారు. ఏదో కొంత పని చేద్దామని వారు అనుకుంటుండగానే ఎన్నికలు జరిగి కాంగ్రెసు ప్రభుత్వం మారిపోయి తెలుగు దేశ ప్రభుత్వం ఏర్పడింది. ఈ ప్రభుత్వం అకాడమీ అధ్యక్షుణ్ని, కార్యవర్గాన్ని మార్చవలెనని సంకల్పించి రాజీనామా చేయమని అందరి సభ్యులకూ టెలిగ్రాములు పంపించింది. అందరూ

రాజీనామా చేశారు. ఇంకా పునర్నిర్మాణం జరగలేదు. జరుగుతుందో లేదో తెలియదు. ఈ అకాడమీని గూడా తెలుగు విశ్వ విద్యాలయంలో భాగంగా చేర్చవలెననే ప్రయత్నం గూడా కొంతమంది చేస్తున్నట్లు తెలుస్తున్నది. ఎవరి యోచనలు వారివి. ఎవరికీ పనిమీద అంత శ్రద్ధ కనిపించడం లేదు. ప్రభుత్వాలు మారినప్పుడల్లా కమిటీలు మారడం. కార్యక్రమాలు మారడం తరచు జరుగుతున్న పనే. అయితే అది సాహిత్య సంస్థల్లో అంత ఎక్కువగా జరిగేదికాదు. ఇప్పుడది సాహిత్య సంస్థల్లోనికి గూడా ప్రవేశించినట్లు కనబడుతున్నది. ఎంతో సదుద్దేశ్యంతో ఏర్పరచబడిన హిందీ అకాడమీ అనిశ్చిత స్థితిలో పడిపోవడం సంతోషకరమైన విషయంగాదు. అకాడమీ సాధించవలసిన హిందీ కార్యక్రమం చాలా వున్నది. భవిష్యత్తులో ఏమి జరుగుతుందో వేచి చూడవలసిందే.

# సాహిత్యవీథి

## 'పినవీరన జైమినీ భారత పారిశస్త్యం"

—కె. మార్కండేయులు

సహస్ర వసంతాల ఆంధ్ర సాహితీ లోకంలో ప్రాచీన పద్య కవితాకాశంలో ధ్రువతారలుగా వెలుగొందిన కవిపుంగవులలో సరసులకు కర్ణ రసాయనమైన వాక్యసరణితో జైమినీ భారతాది కావ్యాలను రచించి అందించిన పిల్లలమఱ్ఱి పినవీరన ఎన్నదగినవాడు. పురాణానువాద సరణినుండి ప్రబంధ కల్పనా రీతివైపు ఆంధ్ర వాఙ్మయాన్ని మరలించే మార్గంలో సంధియుగంగా పేరు వడసిన, శ్రీనాథయుగ కవులలో ఈ పినవీరన ప్రముఖుడని చెప్పవచ్చు.

ఈ 'పినవీరన' ఇంటిపేరు పిల్లలమఱ్ఱి, తండ్రి 'గాదిరాజు'. 'పిల్లలమఱ్ఱి ' అనే ఊరిలో నివసించుట వలన వీరి వంశము పిల్లలమఱ్ఱి యని పేరొందినదని ఈ కవి వంశము వాడినని చెప్పికొనిన 'పెనుమళ్ళ సోమయామాత్యుని" 'సీమంతినీ పరిణయం' అనే గ్రంథం వలన తెలుస్తున్నది.

'కవి వర్ణనీయు డా గాదిరాజు వివేక ధనుడు
పిల్లల మఱ్ఱి యను పురమున
నధివసించుటఁ జేసి యాపేర విఖ్యాతమై
ప్రకాశించె నయ్యన్వయంబు'

అనే సీసపద్య పాదాలవల్ల పై విషయం తెలియుచున్నది: ఈ పెనుమళ్ళ సోమయామాత్యుడు పినవీరనకు 150 సం॥ తరువాతివాడు. పినవీరన వంశము మొదట పెనుమళ్ళగా అతని తండ్రి గాదిరాజు నుండి వారి కుటుంబము పిల్లలమఱ్ఱిగా మారినదని కొంద రూహింపగా పిల్లలమఱ్ఱి వంశమే అనంతరము పెనుమళ్ళగా మారినదని కొందరూహించిరి. ఏమైనను పినవీరన బాల్యము పిల్లలమఱ్ఱిలో గడిపి ఉండుననుటలో సందేహములేదు. జన్మస్థలము కూడా పిల్లలమఱ్ఱికాని తత్పరిసర ప్రాంతముకాని కావచ్చును. 15 వ శతాబ్దము, 1420–1500 మధ్యకాలము ఇతని జీవితకాలమును పరిగణింపవచ్చును.

ఇతని తల్లి నాగమాంబ. వీరిది కాశ్యపస గోత్రమని కొందరూహింపగా భారద్వాజస మరికొందరు ఊహించిరి ఇతడు నియోగి బ్రాహ్మణుడని కొందరూహింపగా కాదని మరికొందరు తమ వాదనలను బయల్పరచినారు. ఏది ఏమైనా పినవీరన సద్బ్రాహ్మణుడు, సద్గోత్రజాతుడు

తెలుగు పండిట్, ఎమ్. ఆర్. హైస్కూల్, విజయనగరం–531 202, ఆం. ప్ర.

వీరివంశము కవిపండితవంశము. శారదా పీఠముగా ప్రసిద్ధి పొందినది.

'తాతయుఁ దండ్రియు నగ్ర భ్రాతయునుం
దాను భువన భాసురకృతి ని
ర్మాతలు పిల్లలమఱ్ఱి వి. ఖ్యాతుని పినవీరు
బోలగల రే సుకవుల్'

అనే జైమినీ భారత అవతారికలోని పద్యాన్ని బట్టి వీరిది కవిపండితవంశమని తెలియుచున్నది.

అమృతాంశు మండలం బాలవాలముగాఁగ
మొలిచె నొక్కటి జగన్మోహనము గాఁగ
జిగురించె నిలయసిందుగతకై తవడింత
శయనీయ వరపలాశములతోడ
బితృదేవతలకు నందిత సత్ఫలాలయై
చెట్టుగ బైను గయాక్షేత్రసీమ
నిలువ నీడయ్యె నిందీవరప్రియకళా
కోటీరునకు భోగికుండలునకు
వట్టిమాత్రంబె పిల్లలమఱ్ఱి పేరు
పేరువలెగాదు శారదా పీఠకంబు
వారిలో వల పినవీరు వాక్యసరళి
సరసులకు నెన్నఁగర్ణరసాయనంబు.

పై పద్యము వలన వారి వంశము శారదా పీఠమని, అందు పినవీరుడు సరసులైన వారికి కర్ణరసాయనమగు రీతిని కవిత్వ మల్లగల్గినవాడని తెలియుచున్నది

పినవీరన బాల్యమునందు పిల్లలమఱ్ఱి పురమున ప్రౌఢవయస్సులో సోమరాజుపల్లెయందు పరవయస్సున విజయనగరరాజ్యమున గడపి యుండవచ్చును. సోమరాజుపల్లెలో ఉన్నప్పుడే తడు 'శృంగార శాకుంతల'మను కావ్యమును, విజయనగరరాజ్యమును చేరిన తరువాత జైమినీ భారతమును రచించియుండును.

## గురువు—ఉపాసన

''భారతీతీర్థుం''నెడి 'యతిసార్వభౌముడు' ఇతని గురువు ''భారతీతీర్థ యతిసార్వభౌమ గురు కృపాతిశయలబ్ధ కవితావిభూతి కల్గి గౌరవము గాంచినాడవు కవులచేత" అనెడి శృంగారశాకుంతలములోని అవతారికయందలి పద్యమునుబట్టియు ''శ్రీభారతీతీర్థ గురుచరణ కరుణా కటాక్ష లబ్ధ సిద్ధ సారస్వత పవిత్ర'' అనెడి శృంగారశాకుంతలములోని ఆశ్వాసాంతగద్యం వలన పైవిషయము స్పష్టమగుచున్నది. జైమినీ భారతమందును 'భారతీతీర్థ శ్రీచరణ కరుణాపాత్రు'నిగ పినవీరన తన గురించి చెప్పికొనుట కన్పడును.

శృంగార శాకుంతల రచన నాటికి 'ఆరాధ్యతో అమర వీరభద్రుడు', 'శివభక్తుడు' అయిన పిన వీరన జైమిని భారత రచన నాటికి శివకేశవా భేదము పాటించినట్లు కన్పడును.

ఇతని మహిమలను గూర్చి, ఉపాసనలను గూర్చి కొన్ని దంత కథలు (పుక్కిటి పురాణములు) ప్రచారములో గలవు. ఇట్టి కథలకు సీమంతినీ పరిణయము లోని కొన్ని పద్యము లాధారము కావచ్చును.

చాలా కాలము పాటు పిన వీరన తల్లిదండ్రులకు సంతానము లేకపోగా భారతీ తీర్థుల అనుగ్రహమున మంత్రోపదేశము పొంది పెద వీరన, చిన వీరన అను ఇదువురు పుత్రులను పొందిరట. పిన వీరభద్రుడు సాక్షాత్తు వీరభద్రుని అవతారమా యన్నట్లు పుట్టుకతోనే జడలతో పుట్టి నాడట.

గురువగు భారతీ తీర్థుల అనుగ్రహము వలన పిన వీరన సరస్వతీ మంత్రము'జపించి భారతీదేవి

యనుగ్రహమును పొందియుండును. కాని 'వాణి నా రాణి' అని పిన వీరభద్రుడు చెప్పుచున్నట్లుగ ఒక కథ ప్రచారములో గలదు.

జైమిని భారతమును అంకిత మందుకొన్న 'సాళువ నరసింహభూపతి' పినవీరనకు జైమిని భారతమును రచించుటకై కొంత గడువు నీయగా నిర్ణీతగడువులోగా కావ్యమును రచింపవలసిన పినవీరన చివరిరాత్రి వరకు శ్రీకారము చుట్టక ఆఖరి రోజురాత్రి శుచియై ఒకగదిలో కూర్చుని సరస్వతి నుపాసించగా అమె వచ్చి తానే స్వయముగా వేగముగా ఆగ్రంధమును రచించు తరి చివరి సమయమున పినవీరన అన్నయగు పెద వీరన గదిలో నుండి విన్నడు గంటపు ధ్వనికి ఆశ్చర్యపడి కుతూహలముతో తొంగి చూడగా సరస్వతి అదృశ్యము కాగా మిగిలిన భాగమును పినవీరన పూరించి మరునాడు సభలో ప్రభువునకు సమర్పించెనట 'ఒక్కరాత్రి 8 ఆశ్వాసముల గ్రంధమునీవెట్లు రచించితివి,వాగ్దేవి ఏతద్రచన లోనీకు సహాయపడినదని వింటిమి' అనిసభ్యులు పినవీరనను ప్రశ్నింప నాతడు ఆవిషయము నంగీకరించుచు 'వాణినారాణి' యనియనెనట. ఇదీ కథ. జగన్మాతయైన సరస్వతిని ఎంతటి కవియైనను మూర్ఖునివలె రాణిగా భావింపడు.

పై కథకు ఆధారముగా బహుశః సింహాసన ద్వాత్రింశికలోని (?) పరిణయములో పెనుమళ్ళ సోమయామాత్యుడన్న 'వాణి ఇల్లాలుగా, గవిశ్రేణి కెల్ల పృథుతరాశ్చర్య కరమైన బిరుదు పూనె' అను పద్యపంక్తులను భావించవచ్చును. రాణిగా భావించుట అనగా 'మంత్రాధిష్టాన దేవతగా పూజించుట' అను అర్థము కొందరు చెప్పుదురు. రాణి. రాజ్ఞి అను మాటలు శారదాదేవిని గూర్చి మంత్ర శాస్త్రజ్ఞులు పిలుచుటకు వాడుదురని వారి తలంపు ఏదిఏమైనా భారతీతీర్థుల అనుగ్రహము వలన అతడు సరస్వతీ ఉపాసన చేసి ఉండును. అందువల్లనే జైమిని భారత అవతారికలో—

'ప్రణవ పీఠమున మంత్ర పరంపరలు గొల్వ
  నుండు నే దేవి పేరోలగంబు
భావజ్ఞులకు పరాపశ్యంతి మధ్యమా
  వైఖరులే దేవి వర్ణసరణి
జపహార కీరపుస్తక విపంచి సమంచి
  తంబు లేదేవి హస్తాంబుజములు
కుందేందు మందార కందళీబృందంబు
  చంద మేదేవి యాందమూ రి
కాంచెనే దేవి కాంచన గర్భచతుర
పూర్వదంత కవాట విస్ఫుట మనోజ్ఞ
చంద్రకాంత శిరోగృహస్థల విహార
మమ్మహా దేవి వాగ్దేవి నభినుతింతు.'

అని సరస్వతీ ప్రార్థన చేసినాడు. పై విధముగా మంత్రశాస్త్ర రహస్యము తెలిసి సరస్వతి నుపాసించి ప్రార్థించిన కవి 'వాణి నారాణి' అని నిండు సభలో ప్రకటించినాడనుట మిగుల ఆశ్చర్యకరం మే కాగలదు.

## పినవీరన కృతులు :

రచియించినాడవు రమణీయ శాగ్రిత
  నవతార దర్పణం బభినవముగం
బల్కినాడవు తేటపడజేసి నారదీ
  యము సత్కవిశ్రేణి యాదరింపం
జెప్పినాడవు శేముషీ విశేషంబున
  మాఘమాహాత్మ్యంబు మంజు ఫణితిం
గావించినాడవు ఘనబుద్ధి మానసో
  ల్లాస సారము సముల్లలితయ్యి
భారతీతీర్థయతి సార్వభౌమ గురుకృ
పాతిశయలబ్ధ కవితా విభూతి గర్గి

గొంవముఁగాంచి నాడవు కవులచేత
విపుల చాటూ_క్తి నిర్నిద్ర వీరభద్ర'
'శృంగార శాకుంతలము' 1ఆ 22ప.

పై పద్యమును బట్టి పినవీరన 'అవతార దర్పణము', 'నారదీయము', 'మాఘమాహాత్మ్యము' 'మానసోల్లాససారము' అనే గ్రంథములు శృంగార శాకుంతలము నాటికి రచించినట్లు తెలియుచున్నది. అయితే ఈ గ్రంథములు నేడు నామ మాత్రావశిష్ట ములు. అయితే అవతార దర్పణము అను గ్రంథ మునకు బదులుగ 'నవరస దర్పణము' అనుపేర పాఠాంతరము కొన్ని గ్రంథములందు కానవచ్చు చున్నది. ఏది ఏమైనా పై నాలుగు గ్రంథములు అలభ్యములు. కాగా లభ్యమైన గ్రంథములలో మొదటిది శృంగార శాకుంతలము ద్వితీయము ద్వితీయ గ్రంథము జైమినీ భారతమగుచున్నది.

## జైమినీ భారత కృతిపతి–రచనా కాలము :

జైమినీ భారతమును పినవీరన సాళువ నృసింహభూపాలునకు అంకితము చేసెను ఈ సాళువ నరసింహభూపతి చంద్రవంశపురాజు, ఈయన జైమినీ భారతమును రచింపజేసి అంకి తము గొనవలెనను తలంపుతో'

నామది నిరతము భారత. రామాయణ
కథల్ ప్రేమ రంజిలు నందున్
జైమిని భారతమునగా, భూన పూర్వము
పురాణముల గణియింపన్'
అపురాణము గనఁదెనుగయ్యోనేనిఁ, జెప్ప
నేర్చిన కవియుఁ బ్రసిద్ధుడేని
దెనుగు నుడికారమున మించుగనియెనేని,
కుందనము కమ్మవలచిన చందమగును.

అని సభాసదులతో పలుకగా సభాసదులు దానికి తగిన వ్యక్తి పినవీరన యని పల్కిరి.

ఆ విధముగా పినవీరన రచనకు కృతిపతి సాళువగుండ నరసింహభూపతి కాగా దీని రచనా కాలము 1483–1490 కాలముగా విమర్శకులు నిర్ణయించిరి.

జైమినీ భారత అవతారికలో కృతిపతి వంశ వర్ణనలో పినవీరన జెప్పిన ఈ క్రింది పద్యము పరికించిన కవి చమత్కారము అవగతమగును.

ఉడుపతి వంశ కర్త మహిమోన్నతి కెయ్యది
మేర నాడు పా
ల్కడలి జనించినప్పుడు దళంబుగనంటి
నమేని జిడ్డువోఁ
గడుగు కొనంగ నబ్బెననికా శివునౌదల
యేటఁ బాదముల్
దడబడ నోలలాడుచు హళా హళిగాపడి
నీదులాడెడిన్

## ఇతివృత్త పరిచయం–రసము

పేరునుబట్టి ఇది సంస్కృతమున జైమిని రచించిన భారతమునకు అనువాదమని చెప్పవ చ్చును, ఇది ఎనిమిది ఆశ్వాసముల కావ్యము. ఇది పురాణమాలేక కావ్యమా ప్రబంధమా అని సందేహ ము తోచును. అవతారికలో ఒకసారి దీనిని కావ్య ముగా మరొకసారి ప్రబంధముగా ఇంకొకసారి పురాణముగా పేర్కొన్నను వాస్తవాన్ని బట్టి చూచిన ఇది వీరగాధా కావ్యమని చెప్పవచ్చును. 'జైమిని భారతము' అనుపేరుతో ఉన్నప్పటికి ఇది మొత్తము భారత కథను తెల్పు కావ్యముకాదు. ఒక్క అశ్వమేధ పర్వము మాత్రమే.

సంస్కృతమున జైమిని మొత్తము భారత మును పూర్తిగ రచించెనా లేక అశ్వమేధ పర్వ మును మాత్రమే రచించెనా అను విషయమున విమర్శకులకు ఏక వాక్యత లేకున్నను సంస్కృత మున జైమిని అశ్వమేధ పర్వమును మాత్రమే రచించియుండవచ్చునని పలువురు ఊహించిరి.

కురుక్షేత్ర యుద్ధానంతరము జ్ఞాతివధచే సంక్రమించిన పాపమును పోగొట్టుకొనగోరి ధర్మ రాజు వేదవ్యాసుని సూచన మేరకు అశ్వమేధ యాగము చేయ సంకల్పించుట భీముడు ప్రతి నపూని యాగాశ్వమును సంపాదింపగ ధర్మజుడు యాగము చేసి యాగాశ్వమును వదలగ అది నాల్గుదిక్కులకు తిరుగుట దానిని రక్షించుచు ధర్మజుని సోదరులు దేశమంతట తిరుగుట. ధర్మ జుడు నిర్విఘ్నముగ యాగ పరిసమాప్తి చేయుట ఇందలి ప్రధాన ఇతివృత్తము. ఇది ఒక విధముగ జైత్రయాత్రావర్ణన కావ్యము కాగా ఇందు నడుమ నడుమ గల ఉద్దాలకోపాఖ్యానము, ప్రమీలార్జు నీయము, బభ్రువాహనుని కథ, కుశలవోపాఖ్యా నము మొదలగు కథలతో రామణీయకత దీనికి చేకూరినది. ధర్మరాజుఅశ్వమేధయాగ నిర్వ హణ యందు ప్రధాన కథయయ్యును అడుగడు గున శ్రీకృష్ణుని మహిమ వ్యక్తమగుచునే యుండును. పాండవులందరూ ముఖ్యముగా భీముడు ఇందు కృష్ణభక్తి కలవాడుగ చెప్పబడుట విశేషము. చంద్రహాసుడు, హంసధ్వజుడు, తామ్ర కేతుడు మొదలైన విష్ణుభక్తుల చరిత్రలు కూడా ఇందు వర్ణింపబడినవి. గ్రంథమందంతట శ్రీకృష్ణుని మహిమ ఆధిక్యత వెల్లడియగుచునే యున్నది. ఈ గ్రంథము భారత రామాయణ భాగవత కథల సమాహారమని చెప్పవచ్చును.

ఈ కావ్యమున ప్రధానరసము వీరము కాగా భక్తి, హాస్యరసములు అంగములగుచున్నవి. గ్రంథమంతట శ్రీకృష్ణుని ఆధిక్యత వెల్లడగుట వలన శ్రీకృష్ణుడే ఇందు ప్రధాననాయకుడై ఏక నాయకాశ్రయత్వమును కుదిరినది. భక్తి కూడా ఒక విధమైన శృంగారము గాన వీరమునకు హాస్యముతో పాటు భక్తి కూడా సహకరించినదని చెప్పవచ్చును.

ఇందలి ఉపాఖ్యానములు లోకమున వేర్వేరు సాహితీ ప్రక్రియలలో ప్రత్యేక ప్రతిపత్తిని పొంది నిర్మించబడినవి, హరికథలు బుఱ్ఱకథల రూపమునే గాక ఇందలి చంద్రహాసుని కథ, బభ్రువాహనుని చరిత్ర, ప్రమీలార్జునీయము వంటివి చలన చిత్రములుగా వెలువడినవి

## సంస్కృత జైమినీ భారతము- వ్యాస భారతము_సామ్యవైషమ్యాలు

సంస్కృతమున జైమిని రచించిన భారత మందు అష్టాదశ పర్వములున్నవని కొందరు అనగా అశ్వమేధ పర్వము మాత్రమే జైమిని రచించెనని కొందరు ఊహింపగ ప్రస్తుతము లభించుచున్నది. జైమిని భారతమను పేరుతో సంస్కృతమున ఒక్క అశ్వమేధ పర్వము మాత్రమే. దీనిని గోరఖ్‌ప్రెస్‌వారు ముద్రించిరి. దాని ముద్రణాకాలము తెలుపబడకపోయినా 1949 సం॥నకు ముందు సంస్కృత జైమిని భారతము గురించి లోకమునకు తెలిసి ఉండకపోవచ్చును. 1949సం॥న ప్రచురణయిన వావిళ్ళవారి పినవీరన రచితమైన జైమిని భారతమునకు పీఠిక వ్రాసిన 'జనమంచి శేషాద్రిశర్మ'గారు సంస్కృత మునకిది ఎట్టి పరివర్తనమో మూలము దొరక

నందున చెప్పబడదు' అన్న మాటలు ఈవిషయమున ఋజువుచేయుచున్నవి.

అయితే వ్యాసమహర్షి శిష్యుడైన జైమిని, ఈజైమిని ఒక్కరేనా? వేదవ్యాసుడు వేదములను ఋగ్యజుస్సామాథర్వంబులుగా విభాగించి తన శిష్యులైన పైల వైశంపాయనసుమంతుజైమినులకు పంచి క్రమముగా చతుర్వేద సూత్రములను చేయించినట్లు భారత అవతారికనుబట్టి తెలియుచున్నది. ఆ వ్యాసమహర్షి శిష్యుడు ఈ జైమిని భారత కర్త ఒక్కరు కాకపోవచ్చును. ఈ జైమిని అంత ప్రాచీనుడుకాడని భారతదేశమున క్రైస్తవమతము ప్రవేశించిన తరువాత, విశిష్టాద్వైతము ద్వైతము వ్యాప్తిలోనికి వచ్చిన తరువాత క్రీ॥శ॥ 12-13 శతాబ్దుంకాలములో ఈగ్రంథము రచింపబడియుండునని విమర్శకులూహించిరి. అందునా ఈజైమిని మహారాష్ట్ర విషయములను గోదావరి నదీవర్ణనము చేయుట మొదలగు ప్రస్తావనలవల్ల ఇతడు దాక్షిణాత్యుడని మహారాష్ట్ర దేశస్థుడు కావచ్చునని తెలిపిరి. జైమిని నామము కేవల గోత్రనామము అయిఉండునని వ్యాసమహర్షి శిష్యునకు ఈగ్రంథకర్తకు కేవలము గోత్రసామ్యము మాత్రముండి ఉండవచ్చునని కొందరి ఊహ.

వ్యాసభారత అశ్వమేధ పర్వమునందు, ధర్మరాజు అశ్వమేధయాగము చేయసంకల్పించుట, సంవర్త మరుత్తీయోపాఖ్యానము. పరీక్షిత్తు ఉత్తర గర్భంబున అశ్వత్థామాస్త్రముచే దగ్ధుడై మరల శ్రీకృష్ణునివలన బ్రతుకుట, అర్జునుడు అశ్వమును అనుసరించుట, ఎదనెదుర్రాజులతో యుద్ధముచేయుట బభ్రువాహనుని చేతిలో అర్జునుడు పరాభవింపబడుట, నకులోపాఖ్యానము. అనుగీత, బ్రాహ్మణ గీత మొదలైన వృత్తాంతములు కలవు.

అశ్వమేధయాగము గావింప ధర్మరాజును వ్యాసుడు ప్రోత్సహించుట, ఆయాగ నిర్వహణకునయు ధనమును సముపార్జించమని వ్యాసుడు మరుత్తుని కథను తెల్పుట యాగాశ్వసంరక్షణ అర్జునుడు నిర్వహించుట, మణిపురరాజ్య పాలకుడగు బభ్రువాహనునితో యుద్ధము మొదలగు విషయములందు మాత్రమే జైమిని భారతమునకు వ్యాస భారతముతో సామ్యము గన్పట్టుచున్నది.

ధర్మరాజు సవనార్హమగు నశ్వము భద్రావతీ పురమున గలదని తెలుసుకొని దానిని తెమ్మని భీముని ఆజ్ఞాపించుట, అశ్వము తెత్తునని భీముడు ప్రతిజ్ఞచేయుట, కర్ణపుత్రుడు వృషకేతుడును ఘటోత్కచుని పుత్రుడు మేఘవర్ణుడును; భీమునకు సహాయము చేయుట, భద్రావతీ పుర ప్రభువగు యౌవనాశ్వునితో కొంత యుద్ధము జరిగిన పిదప సవనార్హమగు అశ్వమును హస్తినకు తెచ్చుట అను విషయములు వ్యాస భారతమున లేనివి జైమిని భారతమున కన్పట్టును.

జైత్రయాత్రా విషయమై కూడ వ్యాస జైమిని భారతములకు కొంత భేదము కన్పట్టును. జైత్రయాత్రలో వ్యాస భారతమున ఉత్తర భారత దేశమునకు ఎక్కువగ ప్రాముఖ్యత నీయగా జైమిని భారతమున దక్షిణాపథమునకు ప్రాముఖ్యత మీయబడినది. బభ్రువాహనుడు అర్జునుని చేతిలో పరాభవము పొందినట్లు వ్యాస భారతమున కానవచ్చుచుండగా జైమిని భారతమున అర్జునుడు నిహతుడై మరల కృష్ణుని వలన బ్రతికినట్లు చెప్పబడినది. ఈ బభ్రువాహనునికి అర్జునునికి జరిగిన యుద్ధ కథామధ్యంలో అదే పోలికలతో గల రామకథ కుశలవోపాఖ్యానము, వ్యాస భారతమున లేనిది జైమిని భారతమున చెప్పబడినది.

జైమిని భారతమున శ్రీకృష్ణుని మహిమలు లెక్కకు మిక్కిలిగా వర్ణింపబడినవి. వ్యాస భార

తమున పరీక్షిత్తు తిరిగి బ్రతుకుట వంటివి తప్ప శ్రీకృష్ణుని మహిమను తెల్పు సంఘటనలు లేకపోగా ఈ పరీక్షిత్తును కృష్ణుడు బ్రతికించుట జైమిని భారతమున లేనే లేదు. ఇవి కాక చంద్రహాస చరిత్ర, ఉద్దాలకోపాఖ్యానము, ప్రమీలార్జునీయ కథ, హంసధ్వజుని కథ వంటివి వ్యాస భారతమున లేనివి జైమిని భారతమునకు వన్నె పెట్టిన ఉపాఖ్యానములుగా తోచును. అర్జునుని మరణమునకు కారణముగా గంగా శాప వృత్తాంతము జైమిని కల్పనయే. వ్యాస భారతమున అంతగా ప్రాధాన్యత లేని అశ్వమేధ పర్వమునకు జైమిని భారతమునందు పై కల్పనలతో ప్రాముఖ్యత సంతరింపజేయబడినది.

పిల్లలమర్రి పిన వీరభద్రుడు జైమినీ భారతమును చాలవరకు యథామూలముగానే అనువదించినాడు. చివరకు ప్రధాన కథకు అంతగా తోడ్పడని కొన్ని అనౌచిత్య సంభాషణలను కూడా పిన వీరన పరిహరింపక తన అనువాదమున చేర్చినాడు. మూలమున గల రుక్మిణీ కృష్ణుల సుదీర్ఘ సంభాషణలు, సీతా పరిత్యాగ విషయమున రామునకు అతని సోదరులకు మధ్య జరిగిన సంభాషణల వంటివి కథకు అంతగా అవసరము కానివను తలంపుతో పరిహరించిన ఈ కవి పై అనౌచిత్య సంభాషణలను ఎందుకు పరిత్యజించలేదో తెలియదు.

## కథా పరిచయం:

మూలమున 5179 శ్లోకములతో 68 అధ్యాయములలో ఉన్న కథా భాగమును 1479 పద్యగద్యములతో పిన వీరన 8 ఆశ్వాసముల గ్రంధముగా మలచినాడు.

జైమిని మహాముని జనమేజయునకు ఈ అశ్వమేధ పర్వకథను చెప్పినట్లుగా కథ ప్రారంభమైనది. ప్రథమాశ్వాసమున ధర్మరాజు కడకు వ్యాసుడు వచ్చి జ్ఞాతివధతో వికలుడైన ధర్మరాజునకు అశ్వమేధము చేయుమని అనుజ్ఞ నిచ్చును.

తన కడకు వచ్చిన వ్యాసునితో ధర్మరాజు—
'గురుడు కుంభజుండు సుర నదీ సూనుండు
జూడలేని రాజ్య సుఖము నాకు
కన్నుదోయి లేని కాయంబు తోయంబు
గాని మిగుల సౌఖ్యకరము కాదు'

అని అంటూ ఇంకా—

"ఏతపముల నే జపముల, నేతీర్థ విలోకనము
నే క్రతువులనీ
జ్ఞాతి వధం బొనరించిన, పాతకము హరించు
నన దపస్వియతనితోన్"

'తురగమేధంబు చేసి కౌతుకముతోడ, గురుకులంబున సత్కీర్తిఁగుదురు కొల్పు'.
అని అనగానే

'కడు నిర్ధనునకు నాకు ఇమ్మహాధ్వరంబు
ఒనరింపన్ జనునయ్య'

అని అర్జునుడు పల్కెను. యజ్ఞము కొరకు ప్రజలను వేచదలచినచో 'గోరుచుట్టుపై రోకటి పోటు చందముగ రోసి జనుల్ నను జూచి తిట్టరే' అని అని కూడ పల్కెను.

దానికి సమాధానముగా 'మరుత్తభూపాలుడు పూర్వము సువర్ణయాగము చేసి బ్రాహ్మణులకిచ్చిన అపార దక్షిణలు వెక్కసమై తుహినాద్రి చేరువను మూలుగుచున్నవని దానిని గ్రహించి యాగము చేయు' మనగా అర్జునుడు బ్రాహ్మణుల సొమ్ము

తెచ్చి పుణ్యము చేయుటకు ప్రయత్నించుట—
'కుడిచి కూర్చుండి శిలదెవ్వకొయ్యజేసి జలధిలో
నీదులాడంగ దలచి నటువంటి'దని పలుకగా
వ్యాసుడు 'ఎవ్వడేలు మేదిని ధనమెల్లనాతనియధీన'
మని 'బ్రాహ్మణుం డీసుకొని పోయినంత తీసుకు
పోగా మిగిలిన ధనమది'యని దానిని గ్రహించి
యాగము చేయమని చెప్పెను.

అశ్వమేధ యజ్ఞము చేయు విధానము కూడా
వివరించెను. అధ్వర ఘోటక లక్షణములను
కూడా వ్యాసుడు ఈ విధముగా వివరించెను.

పాటీర హీర వర్ణము, హాటకపుచ్ఛమును
నల్లనగు చెవులు నిరా
మాట జవంబును నధ్వర, ఘోటక లక్షణ
ములవి.......'

బ్రాహ్మణులకు విధి ప్రకారము దక్షిణలోసగి
హయమును చైత్రపూర్ణిమనాడు విడువవలెనని
సైన్యములతో సుతులైన, తమ్ములైన హయమును
రక్షించుచు పోవలెనని వ్యాసుడు
చెప్పెను. 'శూరులు కలిగినచో ఈ హయమును
పట్టుడు' అని వ్రాసి బంగారపు పట్టమును హయ
మునిటలముపై నుంచి విడువవలెనని" కూడా
వ్యాసుడు చెప్పెను.

భీముడు అశ్వము తెచ్చెదని ప్రతిజ్ఞచేయును.
'దేవతలనైనఁ బట్టి తెచ్చెదహయము" అని
అన్నతో పల్కి భీముడు — 'వాసుదేవుని కృపగల
కెందునరయ దుర్ఘటమైన కార్యముము గలదె'
అని అంటూ క్రతుహయంబుతేకుంటినేని'—

'వేద ఘోషణలేని వీటనున్నయతండు, దలి
దంష్ట్రులకు రెండు దలచునతడు
నూరువాడని నూతనీరు గ్రోలు నతండు,
భూసురావళితోడ బొంకునతడు

నిట లాఘుగుడిలేని కొటికనున్నయతండు,
నిల్లరిధనమీక ఏమనతడు.
దగిలి విశ్వాసపాతకముఁజేసినతండు, శివ
చిత్ర జెవి చెంత జేర్చనతడు'
బోవుగతికి నవశ్యంబు పోదు........'నని
పల్కెను.

పై భీమ ప్రతిజ్ఞ దుర్యోధన దుశ్శాసనాదులను
సంహరింతునని వ్యాస భారతమున పల్కిన ప్రతి
జ్ఞల స్థాయికి తగినట్లు లేక పేలవముగ నున్నదని
కొందరి తలంపు, అయినా ఈ ప్రతిజ్ఞ' అనంతా
మాత్యుని 'భోజరాజీయ'మందు గోవు మాట
తప్పక తిరిగి వత్తునని అట్లురాకున్న ఏ పాప
గతికి తానుపోవునో తెలుపు శపథమును పోలి
యున్నది. భోజరాజీయ రచన జైమిని భారతము
కన్న సుమారు 50 సం॥ల ముందటిగా భావింప
వచ్చును.

భీమునకు సహాయముగా కర్ణపుత్రుడు వృష
కేతుడు, ఘటోత్కచ సుతుండు మేఘవర్ణుడు
యాగాశ్వసంపాదనకై బయలుదేరుటకు సిద్ధపడిరి.
వ్యాసుడు అశ్వమేధయాగముచేయ ప్రోత్సహించి
వెడలిన వెనుక శ్రీకృష్ణుకు ధర్మరాజు దకేతెంచి
యాగము మాట, భీముని ప్రతిజ్ఞవిని భీముని ఆట
పట్టించుచు—

'మంద మతియు, బహ్వాశియు; దుందిలు
డును రాక్షసీరతుడు నిష్ఠురనా
క్రందదర్పితుడు నగుమారుత, నందనసచివతఁ
ప్రయోజనములు ఫలించున్'

అని పరిహాసముగా పల్కి—జ. నందు
హిడింబునిన్ ఒకకాచరు నడపినయట్లు కాదు'—
ప్రతిన నెరవేర్చుట అని అనగా దానికి భీముడు
కూడా పరిహాసపూర్వకముగా—

'అనఘ నీవానతిచ్చిన యట్లు మిగుల, దుంది
ఉడను బహ్వాశి దుష్టరాక్ష
సీరతుండును వగుదుఁజర్చింతేచూడ, దేవరకు
నట్టి గుణములు లేవు గాన'
'మొదట నత్యంత కాముకుఁడ వేటకు గొల్ల,
యిల్లాండ్ర గుబ్బపాలిండ్లు సాక్షి
యతి నీచరతిశీలి వగుటకుఁ బ్రాతీ న,
కమత సూకర విగ్రహములు సాక్షి
బహ్వాశివగుటకు బ్రహ్మాండకోట్లును, బూరిం
పలేని నీ బొజ్జ సాక్షి
శ్రీలోలుఁడగుటకు త్రైలోక్యము నెఱుంగ,
దరకు తెచ్చిన వేల్పుతరువు సాక్షి
జడసముత్సాహి నగుటకు జలధి సాక్షి,
వామనుఁడ వగుటకు బలీశ్వరుడు సాక్షి
మందమతివౌట వది మారపొందెగాక, సరవి
బేర్కొనఁదరమె నీ నటలు కృష్ణ

అని పల్కి'

చడుట లేదికి మనుజరా సంధముఖ్య, నర
పతుః సంహరించుట నీ వెరుగవె
నీ కరుణతోడుగా వైరిన్నపుఁగెల్తు, హయ
ముగొని వత్తు సాగింతునధ్వరంబు'

అని వినయముగా పలికెను.

పై పరిహాసము ఔచిత్యభరితముగాలేదని కొందరు విమర్శకుల తలంపు. భీముని పరిహాసము వ్యాజనిందాపూర్వకమై హాస్యస్ఫోరకము గుచున్నది. ఆధునిక కాలమున 'కృష్ణార్జునయుద్ధము' 'రామాంజనేయయుద్ధము' నాటకాలలో కృష్ణార్జునుల, రామాంజనేయుల మధ్య సాగిన పరిహాస పూర్వక పద్యములకు ఈకృష్ణ భీముల పరిహాసములే కొంత అనుసరణీయములై యుండవచ్చును.

ముందుగ వ్యాసుడు చెప్పిన ప్రకారము భద్రావతీపురమున యౌవనాశ్వుని రాజ్యమందుగల సవనాశ్వమును పట్టితెచ్చుటకు భీముడు కృష్ణుని ధర్మజుని అనుజ్ఞ పొంది కర్ణసుత ఘటోత్కచ సృతులు వెంటరాగా బయలుదేరెను. ఇంతవరకు ప్రథమాశ్వాసకథ.

ఇక ద్వితీయాశ్వాసమందు భీమాదులు యజ్ఞాశ్వంబును చూచుట, మేఘవర్ణుడు అశ్వమును పట్టి తెచ్చుట, యౌవనాశ్వుని సైన్యముతో మేఘవర్ణుడు పోరుట, అతనికి వృషకేతుడు సహాయపడుట యౌవనాశ్వుడు తనసేనను వారిరువురు సంహరించుట చూచి తానే యుద్ధమునకు దిగి వృషకేతుతో యుద్ధము చేయుట వృషకేతుడు మూర్ఛిల్లుట, భీముడు రుద్రుడై సేనను చెండాడుట, యౌవనాశ్వునిపుత్రుడు సువేగుడు భీమునితో ద్వంద్వ యుద్ధమునకు దిగుట మూర్ఛిల్లిన యౌవనాశ్వుని వృషకేతుని ఉద్ధరించుట. తనప్రాణములను కాపాడిన కర్ణసుతుని యౌవనాశ్వుడు అభినందనపూర్వకముగా అక్కున చేర్చుకొనుట, భీమాదులతో కలిసి భద్రావతీ పురమునకేగుట, ఆరాత్రికి అటనుండి మరునాడు సపరివారముగా యౌవనాశ్వుడు వెంట రాగా భీముడు విజయమును చేకొని సవనాశ్వముతో హస్తినాపురికి వచ్చుట అనే విషయములు ప్రస్తావింప బడెను.

ఈ ఆశ్వాసమున వృషకేతనుడు యౌవనాశ్వునితో పోరికి పోవుదు ననుచు యుద్ధము మీద తనకు గల మక్కువను చక్కగ తెలియపరచినాడు

'కరియానం బటు పాశహస్తుఁ బృథుశంఖ
గ్రీవఁ జిత్రస్తనిన్
బరసేనా రమణిన్ వరించితి పురోభాగంబు
నన్ నిల్పి ని

ర్బర కేళిన్ విషమాత్ర చిహ్నములు సేరన్,
వావి గాదింక మా
ను రణోత్సాహము నీవు జన్యరతి గాంతున్నే
యశస్సంతతిన్'

నన్ను వరించినది కారణము గాగ
దేవరకు గోడలైన సేనా వధూటి
సిగ్గుపెంపున మొగము వాంచినది చిత్ర
వై జయంతి నవాంశుకవ్యాజమునను.'

పై పద్యములలో సైన్యమును వధూటితో పోల్చి శ్లేషలో కూర్చుట కవి చమత్కృతికి నిదర్శనము.

ఇక తృతీయాశ్వాసము భీముడు అన్నకు తన విజయము నెరుకపరచుటతో ప్రారంభమగును. వ్యాసు దేతెంచి ధర్మజునకు ధర్మము తెలియచేయుట, జారస్త్రీ లక్షణములను చెప్పుట స్థిరలక్ష్మి యోగము గూర్చి చెప్పుట, భీముడు ద్వారకకు పోయి శ్రీకృష్ణుని గొనివచ్చుట అనుసాళ్వుడు కృష్ణునిపై కోపముతో ముందే మఖాశ్వము నపహరించుట, అతని చేతిలో శ్రీకృష్ణుడు మూర్ఛిల్లుట, వృషకేతుడు అనుసాళ్వుని బట్టి శ్రీకృష్ణుని ముందట చేర్చుట, అనుసాళ్వుడు శ్రీకృష్ణునికి లోబడుట, చైత్ర శుద్ధ పౌర్ణమి నాడు సవనాశ్వమును వదలుట, దాని ననుసరించి అర్జునుడు వెడలుట అను విషయములు ప్రస్తావింపబడెను.

ఈ ఆశ్వాసమున వ్యాసుడు ధర్మజునకు జార స్త్రీల లక్షణములను చెప్పుట ఔచిత్యముగాలదో వదు. అయినను ఆటవెలది లక్షణము ఆటవెలదిలో కవి ఏ విధముగా చెప్పినాడో చూచిన అతని ప్రతిభ మనకు వ్యక్తమగును.

'పరులగన్నఁ జంక పాపని ముద్దాడు, గోడ
ద్రిక్కి చూచుఁ గొప్పుర్చు
మాఱుమలయు నత్తమామలతోలేని, కిటుకు
వెట్టి బంధకీవధూటి'

శ్రీకృష్ణ భీములు హస్తినాపురికి వచ్చుచు ఒక సరోవరమును చూచిరి. ఆ సరోవర వర్ణనము చూచినతో పినవీరన సంస్కృత సమాసభూష్ఠ రచనా సామర్థ్యము వ్యక్తమగును.

'అని బాణారబకాంతకుల్ సముచిత
వ్యాపారులై ముందటన్
గనిరుత్ఫుల్ల సరోజహల్లక వరాగస్ఫార వీచీ
మటా
కనదుత్కూజిత రాజహంస ఒక చక్ర
క్రౌంచ సంచారమున్
బనితాంతః పరితాపవారణ సుధాసారమ్ము
కాసారమున్'

పై పద్యము పోతన్నగారి మహాభాగవతము లోని దశమ స్కంధములోని పూర్వభాగమందలి 'కనియెం గృష్ణుడు సాదునీరము' అనేపద్యమునకు ఛాయగనడిచినది.

(సశేషం)

# కర్నూలు జిల్లా ప్రాచీన కవి
# పోశెట్టి లింగన సాహిత్యసమీక్ష

జవ్వాది శివశంకర్

కర్నూలు జిల్లాకు చెందిన ప్రముఖ ద్విపద కారుల్లో పోశెట్టి లింగన ఒకరు. ఈయన జీవితాన్ని సాహిత్య చరిత్రను తెలుసుకోవాలంటే మనకు లభించే ఏకైక ఆధారం 'నవచోళ చరిత్ర'. ఇది ఐదు ఆశ్వాసాల ద్విపద గ్రంథం. దీనిని 1923లో పంచాజ్ఞుల ఆదినారాయణశాస్త్రిగారు విపులమైన పీఠికతో ప్రచురించారు.

## జీవిత విశేషాలు :

పోశెట్టి లింగన జీవిత విశేషాలను ఊరు, కాలం, వంశావళి, కృతి రచనకు ప్రోత్సాహం, అంకితం, కులగోత్రాలు, గురువు అనే అంశాలుగా విభజించి పరిశీలించడమైనది.

## ఊరు :

కవి స్వయంగా తన రచనలో ఎక్కువగా తన ఊరుపేరును గురించి ప్రస్తావించలేదు. కాని నవ చోళ చరిత్ర అవతారికను పరిశీలిస్తే ఈ ద్విపద గ్రంథాన్ని శ్రీ బిగిరాముపల్లి మృత్యుంజయేశ్వరునికి అంకితం యివ్వమని కవిని ఆ గ్రామ వాస్తవ్యుడైన శ్రీ చక్కిలాల లింగప్ప కోరినట్లు తెలుస్తోంది ఈ బిగి రాముపల్లి ఎక్కడిది? కర్నూలు మండలంలోని బనగానపల్లె సమీపాన వున్న రామపల్లె యీ బిగి రాముపల్లిగ భావించవచ్చు. ఎందుచేతనంటే నవ చోళ చరిత్రకు మూలం కన్నడం. దీన్ని తెనిగించాలంటే కవికి కన్నడం, తెలుగు రెండు భాషల్లో ప్రావీణ్యం వుండాలి. ద్విభాషా ప్రాంత వ్యవహర్తలకు ఈ సామర్థ్యం ఎక్కువగా ఉండే అవకాశం వుంది. క్రీ.శ. 15వ శతాబ్ది అంత్య భాగంలో బనగానపల్లి, ఆదోని, ఆలూరు, పత్తికొండ తదితర ప్రాంతాలు బళ్ళారి మండలంలో వుండేవి. అంతే కాక వీరభద్ర విజయాన్ని రచించిన బనగానపల్లి సీమలోని యాగంటి వాస్తవ్యుడైన గార్లపాటి లక్ష్మయ్య యితని గురువు. ఈ విషయం తన అవతారికలో స్పష్టంగా పేర్కొన్నాడు. సాధారణంగా ఆకాలంలో గురువు యే ప్రాంతానికి చెందిన వాడైతే శిష్యుడు కూడా అదే ప్రాంతానికి చెందిన వాడు కావడం తరచుగా చూడొచ్చు.

ఇతర అముద్రిత గ్రంథాల ఆధారంగా అయ్యలూరు గ్రామాన్ని అగ్రహారంగా పొందాడని తెలుస్తోంది. సామాన్యంగా తమ స్వగ్రామాలను అగ్రహారంగా పొందడం తెలుగు సాహిత్యంలో

రీసర్చి స్కాలర్, తెలుగుశాఖ, యస్వీ యూనివర్శిటీ పి. జీ. సెంటర్, పోస్టుబాక్సు నెం. 50, కర్నూలు

కనిపిస్తుంది. ఈ ఆత్మకూరు కర్నూలు జిల్లా నంద్యాల తాలూకాలో వుంది. కాబట్టి పోశెట్టి లింగన కర్నూలు జిల్లాకు చెందినవాడని చెప్పొచ్చు.

**కాలం :**

పోశెట్టి లింగన కాలం గురించి పండిత లోకంలో భిన్నాభిప్రాయాలున్నాయి.

a) ఆంధ్ర ద్విపద సాహిత్యంలో డా॥ టి. సుశీల గారు కవికాలం క్రీ. శ. 14వ శతాబ్దిగా భావించారు, కాని ఆధారాలు చూపలేదు.

b) ఆరుద్రగారు పోశెట్టి లింగనను క్రీ. శ. **1500** ప్రాంతం కవిగా గుర్తించారు. కాని ఈ శతాబ్దం పూర్వార్ధం వాడా, ఉత్తరార్ధం వాడా అని పేర్కొనలేదు.

c) శ్రీ పంచాఙ్ఞులవారు యితనిది క్రీ.శ. **15**వ శతాబ్ది అంత్య భాగమన్నారు.

d) శ్రీ చాగంటి శేషయ్యగారు యీ అభిప్రాయాన్ని బలపరిచారు.

మొదటి ప్రతిపాదన సహేతుకం అనిపిస్తుంది. ఇతను గార్లపాటి లక్ష్మయ్య గారి శిష్యుడు. గార్లపాటి లక్ష్మయ్య కవిది 14వ శతాబ్ది పూర్వార్ధం అని సాహిత్య చరిత్రకారులు భావిస్తున్నారు. కాబట్టి యితను 14వ శతాబ్దం వాడని భావించవచ్చు.

## వంశావళి

ఈ కవి వంశావళిని గూర్చి తెలుసుకోవాలంటే నవచోళ చరిత్రలోని కొన్ని ద్విపద పదాల్ని పరిశీలించాలి.

'విమల' శివాచార విభవ సంప్రీతి
విమలమౌ నవచోడ విభవంబులెల్ల
నిర్ణయంబుగ జేసి నిపుణత మెఱసి
వర్ణించు నట్టి నావంశ మెట్లన్న
చితిని 'మాతా—హిమగిరి సుతా' యనగ
నతిశయ రీతి పితా రుద్ర యనగ
బాంధవుల్ శైవుల భక్తు లౌ ననగ
శంకర దాసయ్య—శరణ వంశజుఁడ
మూలమౌ శ్రీగురు పూజించు శ్రీల
లింగను పోశెట్టి లింగము వాఁగఁ
బరగిన వాడ సద్భక్తుల కరణ
స్థిరభక్తి మహిమలఁ జెలఁగిన వాఁడ

ఈ పాదాల్ని పరిశీలిస్తే యితడు శంకర దాసయ్య వంశానికి చెందిన వాడని, అతడు హరి దాసుడు కాదని శివదాసుడని స్పష్టమవుతుంది. అంతేకాక పార్వతీ పరమేశ్వరుల్ని తలిదండ్రులుగా, శివభక్తుల్ని తన బంధువుగా భావించినట్లు తెలుస్తోంది.

## కృతి రచనకు ప్రోత్సాహం-అంకితం

నవచోళ చరిత్రలోని ఆశ్వాసాంత పాదాలను పరిశీలిస్తే శ్రీచకిలాల లింగప్ప కృతి ప్రేరకుడని, యితని కోరికమేరకు ఈ ద్విపద కావ్యాన్ని బగి రామపల్లె శ్రీ మృత్యుంజయేశ్వర స్వామికి అంకితం యిచ్చాడని స్పష్టం అవుతోంది. మరో ముఖ్య విషయం యేమంటే ఆశ్వాసాంత గద్య పద్యాలలో సాధారణంగా కృతిభర్తనుగాని లేక తన ఇష్ట దైవాన్నిగాని స్తుతించడం కనబడుతుంది. కాని యిందులో నవచోళచరిత్ర కృతి ప్రేరకుడైన శ్రీ చకిలాల లింగప్పను స్తుతించడం జరిగింది

## కులగోత్రాలు

తన రచనలో యెక్కడ కులాన్ని గురించి ప్రత్యేకంగా చెప్పకోక పోయినప్పటికి అందులో

అక్కడక్కడ శరణ సాశాతాడు, శరణగోత్రుడు భక్తగుణస్తుతి, నందీశ్వరుడు, భృంగీశ్వరుడు మొదలైన పదాలను ప్రయోగించడంవల్ల యితడు వీరశైవుడని,

'శ్రీనంది నాథుని భృంగినాథు
మౌన కంఠారు కుమ్మర గుండపభుని
శంకర దాసయ్య సమవారి మరళు''

అనే ద్విపద పాదాలవల్ల యితడు కుమ్మర కులస్థుడని భావించవచ్చు.

## రచనలు

పోశెట్టి లింగన నవచోళ చరిత్ర అవతారికలో యితడు మల్హణ చరిత్రలో' శంకరదాసయ్య చరిత్ర' వీరసంగయ్య దేవచరిత్ర, శిష్య ప్రబోధము, నవచోళ చరిత్రలను రచించినట్లు పేర్కొన్నాడు. వీటిలో ఒక నవచోళ చరిత్ర తప్ప మిగిలినవన్నీ అలభ్య గంధాలే.

## వస్తుపరామర్శ

నవచోళ చరిత్ర వస్తుపరామర్శను మూలం, ఇతివృత్తం–శీర్షికలు, నవచోళ చరిత్ర ఇతర శైవ కథలు, శైవ మత విషయాలు, శాస్త్ర చర్చలు అభ్యుదయాంశాలు అనే అంశాలుగా విభజించవచ్చు.

## మూలం

నవచోళ చరిత్ర ప్రథమాశ్వాంలోని–
భావజ్ఞులగు భక్తి పరులు గారణులు
రసికులు నవచోడరాజులు మున్న
నసలార బూజించి మాధ్యత మించి
వ నొప్పు మోక్షము వడసిన మహిమ
గలుగన్నడమున జేసి రాద్యులు మున్న
వెలయగా నివును విజ్ఞానమునకు
దెలుగున నద్దాని ద్విపదగావించి'

అనే ద్విపద పంక్తుల్ని పరిశీలిస్తే భక్తి తత్పరులు, భావ సంపన్నులు అయిన నవచోళరాజుల కథను యింతకు ముందు కన్నడంలో రచించినట్టు తెలుస్తోంది. కాని కన్నడ మూలగ్రంథం అలభ్యం.

## త్తం-శీర్షికలు

ఈ కావ్య యితివృత్తం గొప్ప శివ భక్తులైన నవచోళుల చరిత్ర. ఇందులో పండితారాధ్యులవారు భైరవరాజుకు ఎనిమిది మంది చోళుల కథలను వివరిస్తారు. తొమ్మిదవచోళుడు భైరవరాజేనని పరిత భావించవచ్చునివుంది.

ప్రథమాశ్వాసంలో కరికాలచోళుని చరిత్ర ద్వితీయాశ్వాసంలో విక్రమచోళుని చరిత్ర. తృతీయాశ్వాసంలో ఉత్తుంగ అహివర, వరధర్మ, సత్యేంద్రచోళుల కథలు, చతుర్థాశ్వాసంలో మనుజేంద్ర, వీర, ఉత్తమ చోళుల కథలు, పంచమాశ్వాసంలో కథా శ్రోత అయిన భైరవరాజుకు సంబంధించిన కథలు వివరించబడ్డాయి,

ఈ నవచోళులందరు శివభక్తి దురంధరులు, శివసేనా తత్పరులు, ధర్మదీక్షాబుద్ధులు. పరమ ధార్మికులు, వీరు వేయించిన శాసనాలవల్ల అనేక శైవాలయాలకు వీరు విరివిగా దానాలు చేసినట్లు తెలుస్తోంది.

## శ్రమైక జీవన సౌందర్యం

ఈ కావ్యంలో మనకు అనేక అభ్యుదయ అంశాలు కనిపిస్తాయి. నవనాథులలో మొదటి

వాడైన కరికాళచోళుడు కావేరినదికి కట్టకట్టిస్తున్న ప్పుడు ఎలాంటి నిరంకుశ విధానాలను పాటించాడో, అక్కడ గ్రామికులతో వెట్టిచాకిరి ఎలా చేయించుకున్నాడో, పోశెట్టి లింగన తన నవచోళ చరిత్రలో వివరంగా తెల్పారు.

కావేరికి కట్ట కట్టాలనుకొన్న కరికాళచోళుడు ఉప్పరులను, కులగుండకులను, కాసెలవారిని, లోహకారులను, దొరలనాయకులను, గ్రామాధిపతులను, పిలుస్తాడు. ఈ తటాక నిర్మాణంలో నైపుణ్యంగల గ్రామికులు, బండచాకిరి చేసే గ్రామికులు పాల్గొన్నారు. దొరలు, నాయకులు మాత్రం తరపెత్తనం చేశారు.

లింగకవికి 'కాయికం' గురించి బాగా తెలుసు. ఎందుకంటే అతడూ గ్రామికుడే. అతనిది కుమ్మరి వృత్తి. శైవులు కాయకష్టం చేసుకోవడాన్ని 'కాయికం' అంటారు. కాయికం వల్ల వచ్చే అర్థంలోనే కల్పవృక్షాలున్నాయని భావిస్తారు. కవి కాయికం చేసి దానిలో జంగమార్చన చేసే కైకూలి కేతయ్య కథను చెప్పాడు. తర్వాత—

'కాయికార్థంబు దాకల్పభూరుహము
కాయికార్థంబు దాక్షదతీరు విధము
కాయికం సద్భల దాయకం బెలమి
కాయిక లబ్ధమున మనగురలింగ
జంగమారాధన సఫలము నీవు
మంగళ ప్రదముగా—' (226)

అంటూ కష్ట జీవులకు కష్టానికి వుండే విలువను సాహితీకరిస్తాడు.

## శైవేతర కథలు

ఈ కావ్యంలో నవచోళుల చరిత్రలే కాక వాటితోపాటు ఇతర శైవ భక్తులను గూర్చి కూ వివరంగా పేర్కొనడం జరిగింది. అందులో పిట్టవ్వ, కోనంగి దాసరుల కథలను మిక్కిలి హృద్యంగా రచించాడు.

పిట్టవ్వ అట్లు వేసుకొని అమ్ముకొనే ముసలమ్మ. ఈమె దగ్గరికి నల్లని దేహం, నల్లని గడ్డం, నల్లని గొంగళి వేసుకొని కోనంగి దాసరి వచ్చి—

'కావేరిగట్టును గట్టగా వంతు
రావలెనని చోడరాజు భృత్యులను
తరిమిరి పిలువగా... ...
అవ్వనీకై వెట్టి కరిగెద నేను
జవ్వన నీవిపుడు చేసెరియట్లు
తనకలైన వినాకు దొరకొని యొసంగి'

అని చెప్పి వెళ్ళిపోయాడు. తన నేర్పరితనంలో కట్టినాయకుణ్ణి మెప్పిస్తాడు. అక్కడ పని చేస్తున్న స్త్రీలందరిని తన చాతుర్యంలో నవ్విస్తాడు.

సారెకునిట్టి హాస్యములు నవ్వింప
వారలు గడ్డపారల విడచి
పనుల మానుచు వెంట బరుగులు వారి
మునుకొని యేతెంచి మూకలుగూడి
కెవ్వన నవ్వుచు కేకలు నిడగ
దవ్వుల వాడెల్ల దవిలి యేతేర
కర మర్ది గావేరి గట్టించునట్టి
దొరలు నాయకులను దోడ్తోట భటులు
పురికొల్ప......... ...

అని హాస్యాలాడుతున్న కోనంగి దాసరిని అక్కడవున్న కట్టనాయకులు పట్టుకొని పెడబొబ్బలు పెట్టేట్లు కొడతాడు. ఆ వార్తవిన్న కరికాళుడు అతనిని తన సన్నిధికి పిలిపించి వెదురు బొంగులతో వీపును చిట్లగొట్టిస్తాడు.

'దెబ్బలు వీపున దేలెకీయట్లు
దెప్పలు పడగ పెనుమెచ్చిల విడుచు
చేతులు వొడ్డుచు భీతి నొందుచును
కూతల బెట్టుచు —

అంటూ కోనంగి దాసరి తన శిక్షను అనుభవిస్తాడు. తర్వాత కరికాళచోళుడు యితడు కోనంగి దాసరికాడు, తనను పరీక్షించడానికి వచ్చిన పరమశివుడని గుర్తిస్తాడు.

## రూపవిశ్లేషణ

ఈ ద్విపద రూపాన్ని పురాణమా? చారిత్రక కావ్యమా? శైలి ప్రాసనియమం. వర్ణనలు, శైవాచారాలు. అనే అంశాలుగా విభజించడమైంది.

## పురాణమా? చారిత్రక కావ్యమా?

ఈ నవచోళ చరిత్ర పురాణమో, చారిత్రక కావ్యమో స్పష్టంగా నిర్ధారణ కావడంలేదు. డా॥ జి. నాగయ్యగారు తన ద్విపద వాఙ్మయములో దీన్ని చారిత్రక కావ్యంగా పేర్కొన్నారు. ఒకవేళ వాదనకు వీరందరిని చారిత్రక వ్యక్తులుగా సమ్మతించినా కవి మాత్రం ఈ కావ్యాన్ని శివభక్తులైన నవచోళుల భక్తి తత్పరతను వెల్లడించే ఒక భక్తి కావ్యంగా రచించాడు.

## శైలి

పోశెట్టి లింగన శైలి సాధారణంగా ఒడుదుడుకులు లేకుండా సాగుతుంది. కష్టపదాలి కాని, దీర్ఘ సమాసాలు కాని వుండవు. అతని శైలి యిలా సరళంగా సాగిందనడానికి ఈ క్రింది పద్యిద పంక్తులే తార్కాణం.

జనమతంబుగ. బూర్వ జన్మంబునందు
మనుజుండనై బహుమన్ననల్ బడసి
వెలయ నవ్వుల ననుభవించుటః జేసి
బలువేగ వానింట, బసవు, రూపమున
జనియించి యష్ట, కష్టంబులు బరుచు
పనిచేసి పెట్టితి బహుమార్గములను
అట్టి చందమున నా బుణశేష
మెట్టుచు దీఅక యీగతినేను
యీచేని కావలి నిట్లున్నదాన
ఈ చంద మెఱుంగక యీ తిలలు నీవు
అపహరించియు నేమి యార్జింపగలవు
ఉపమెఱుంగవు నీవు ఊరకనూవు
చెనసి నువ్వుల బుణము చెడ్డది యనుచు
వినియు నెఱుంగవు వేదుఱుగావు
చనుమన్న నవ్వుల జల్లున విడచి
చనియె నచ్చట నుండి సారమార్గమున''

ఈ కావ్యమంతట ప్రాపనియమం పాటించబడింది.

## వర్ణనలు

పోశెట్టి లింగన మంచి భావసంపన్నుడు. తన కవితాశక్తిచే సందర్భాన్నిబట్టి వర్ణనలు చేసి, కావ్య సౌందర్యాన్ని పెంచాడు.

శిష్టతరంగముల్ చిందులు వార
గట్టిన పురి బుట్ట గానెయుగాగ
స్థిర కరంబగు మేటి తిరుపులు మేన
బరగదాల్చిన చక్ర బటువులుగాగ
హర్షంబు దనర మృణాల జాలంబు
వరుస పీడిన జటావళులను గాగ
ప్రబలాబ్జ దళము లాభరణముల్ గాగ
ఫణి ఫణామణి గణ ప్రభలును గాగ

స్ఫుటతర రక్తాబ్జములు నెన్నబడిన
నిటల తటాంబు కోత్కట వహ్ని గాగ
వెలనురుగులను వాపరి న్నబ
పలుచని నెఱపూత భస్మంబులాగ
ప్రస్ఫుర న్మృదు జలము ప్రబలి మౌనసగ
నవిరి గప్పిన కరి చర్మంబు గాగ
రాకీర కలంకకంఠరాజు హంసాది
మూకలు బూజించు మునులమీ గాగ
విరిదమ్మి కెందమ్మి విరులద్దినెన్న
విరివిబూన్పు ప్రపాద విరులను గాగ
సలలిత పద్మ రసంబులు గ్రేలు
కలతుమ్మెదలు నీలకంఠముల్ గాగ
బుద్బుద జాలంబు తుతనెన్న నరిము
నద్భుత స్ఫటికారక్ష మాలికల్ గాగ
నదిమొప్పె శ్రీ విశ్వనాథుడనగ"— అని

కావేరినదిని శ్రీవిశ్వనాథునిగా వర్ణించి తన కల్పనా పాటవాన్ని నిరూపించుకొన్నాడు.

## శైవాచారాలు

పోశెట్టి లింగన తన నవచోళచరిత్రలో శివాధిక్యాన్ని నిరూపించడమేకాక శైవేతర కథలను కూడా పేర్కొన్నాడు. అంతేకాక ఈశ్వర పూజా విధానం ఆరాధనా విధి నైవేద్యవిధానం మొదలైన శైవాచారాలు కూడా పేర్కొన్నాడు.

ద్విపద సాహిత్య చరిత్రలో పోశెట్టి లింగన్న గారి నవచోళచరిత్ర సముచిత స్థానాన్ని పొంద గలిగేది అయినా ఈ కృతి ముద్రింపబడి కూడా తగినంత ప్రచారాన్ని పొందలేక పోయింది. ఎందుకో జిజ్ఞాసువులైన పరిశోధకులు పరిశీలించ వలసి వుంది.

# జాషువా కవిత్వంలో స్త్రీ సమస్యలు

— ప్రగడ వెంకటేశ్వరరావు

పేదరికంలో పుట్టి అంటరానివాడుగా సంఘం చేత వెలివేయబడి, దుర్భరమైన ఆవేదనతో, అనంతమైన కారుణ్యంలో హృదయాన్ని నింపుకొని, సమాజం మీద నిశితమైన విమర్శలు కురిపిస్తూ కవిత్వం అల్లిన నవయుగ కవిచక్రవర్తి జాషువా. మానవజాతి మనసును, మాటను, వర్తనాన్ని సంకుచితం చేసే ఏ మతమైనా, ఏ సాంఘిక సమస్యైనా ఆయనకు తలనొప్పి పుట్టించింది. ఆ మతంమీద, సాంఘిక సమస్యమీద ఆయన అక్షరాలతో సాగించిన యుద్ధమే కవిత్వం.

ప్రజల అభిరుచులు కాలంతో మారుతున్నాయని గ్రహించి ఉద్గ్రంథ రచనలకు స్వస్తిచెప్పి, ఖండకావ్యాలు, లఘుకావ్యాలు అల్లిన నవ్యకవి ఆయన. అహింసావాదిగా, అస్పృశ్యతా శత్రువుగా కవితాశిల్పిగా, వైతాళికుడుగా ఆయన ప్రసిద్ధుడు. సమత, మమత, మానవత ఆయన కవితకు మూడు పాయలు.

జాషువాగారు 1895 సెప్టెంబరు 25వ, తేదీన గుంటూరు జిల్లా వినుకొండ గ్రామంలో గుర్రం వీరయ్య లింగమాంబలకు జన్మించారు. ఇతడు బాల్యజీవితంలోనే ఎన్నో సామాజిక దురన్యాయాలకు గురయ్యాడు. ఎన్నో అవమానాలను భరించాడు. కులం వల్ల కలిగిన హైన్యం. దుస్సహ దారిద్ర్యం వల్ల కలిగిన దైన్యం జాషువా గర్భమును కలంచి వేశాయి. ఆ పరాభవాలు, అనుభవాలు అనంతరకాలంలో అతని కవితలకు ప్రోద్బలకాలయ్యాయి.

అందుకే జాషువా ఇలా అంటాడు ''జీవితం నాకు ఎన్నో పాఠాలు నేర్పింది. నాకు గురువు లిద్దరు. పేదరికం—కులమత భేదం. ఒకటి నాకు సహనాన్ని నేర్పితే రెండోది నాలో ఎదిరించే శక్తిని పెంపొందిందేగాని బానిసగా మాత్రం మార్చలేదు. దారిద్ర్యాన్ని, కులభేదాన్ని కూడా చీల్చి నేను మనిషిగా నిరూపించుకోదలిచాను. వాటిపై కత్తి కట్టాను. అయితే నా కత్తి కవిత. నా కత్తికి సంఘంపై ద్వేషం లేదు. దాని విధానంపై ద్వేషం'

అసమానతలకు సాంఘిక సమస్యలకు ఆలవాలమైన అప్పటి సమాజము అతనిని కవిగా తీర్చిదిద్దింది. అతడు కవితా ప్రస్థానానికి ఉపక్రమించ దానికి ముందు అంటే ఇరవయ్యో శతాబ్ది తొలిపాదంలో ఆంధ్ర సాహిత్యలోకంలో ఉండిన వాతావరణం పరిశీలించినట్లైతే కవిత్వమును సంఘ

కావేరి హాస్టల్, ఉస్మానియా యూనివర్సిటీ క్యాంపస్, హైదరాబాదు–500 007.

సంస్కరణకొక ఆయుధముగా నుపయోగించు కొనిరి. ఆంధ్రదేశమున బ్రహ్మసమాజాది నూతన సంఘములు వెలసినవి. వీరేశలింగం పంతులువంటి మహాత్ము లుద్భవించి సంఘ సంస్కారమొనరించిరి. ఆ కాలంలోనే గురజాడ అప్పారావు మానవతా వాదానికి కీర్తిపతాకలనదగిన రచనలు చేశారు. నాడు ముఖ్యంగా సాంఘిక స్త్రీ సమస్యలు స్త్రీవిద్య, బాల్యవివాహాలు, విధవావివాహము, సతీసహగమనం వరకట్నము, కన్యాశుల్కనిరసనము ఆధునిక కవులనాకర్షించిన విషయములు. మంగిపూడి వెంకటశర్మగారు బాలవితంతువివాహము, అబలా వివాహము అనుకావ్యములను రచించిరి. విధవా విలాపము, పండుగ కట్నం అనుకావ్యాలను భోగరాజు నారాయణ మూర్తిగారు రచించిరి. అప్పుడే సామాజిక పరిస్థితులకు గురియై కవితా పరిశ్రమకు ఉద్యమించిన జాషువా దగాపడ్డ సోదరీ మణుల అశ్రుతర్పణాలనే కవితా వస్తువులుగా స్వీకరించి కావ్యఖండికలు అల్లినాడు.

## బాల్య వివాహాలు :

నాడు సమాజంలో కొనసాగుతున్న మూఢాచారాలలో బాల్యవివాహాలొకటి. ఈ బాల్య వివాహాల వల్ల పసి తనంలోనే బలిపశువులయ్యే అబలల దుస్థితి చూసి ఆవేదన వ్యక్తం చేశాడు జాషువ. ఇదే సమస్యపై గురజాడ వారు జాషువ కంటె ముందు 'పుత్తడి బొమ్మ పూర్ణమ్మ' అనే గేయ కథ ద్వారా ధ్వజమెత్తడం జరిగింది. ఇదే పూర్ణమ్మ లాంటి దుస్థితిని 'తెరచాటు' అనే నాటకంలో కళ్యాణిలో చూపించాడు జాషువా.

'బ్రాహ్మశాస్త్రి ఒక సనాతనాచారుడైన బ్రాహ్మణుడు. బుచ్చి రామమ్మ అతని భార్య. ఆమె మేనరికమని ముక్కుపచ్చలారని తన కూతురైన 'కళ్యాణిని' డెబ్బదేండ్ల తమ్మునికిచ్చి పెళ్ళి చేసింది. ఆ దురన్యాయ ఫలితంగా ఊహ తెలియనప్పటికే కళ్యాణి వితంతువైంది'.

ఈ నాటక రచనోద్దేశ్యం సంఘ సంస్కరణ. బాల వితంతువుల హృదయవేదన, సనాతన స్వార్థ పరత్వం ముసలి భర్తలు పడుచు భార్యలతో పడు కష్టాలు మున్నగు విషయాలను లోకానికి వెల్లడి చేయడమే.

## విధవా వివాహము:—

బాల్యవివాహము వలె ఆనాడు భారతీయ వ్యవస్థ ఎదుర్కొంటున్న మరొక సాంఘిక సమస్య విధవా వివాహము నాడు ప్రతి ఆరుగురు హైందవ స్త్రీలలో ఒకరు దుర్భరమైన వైధవ్య జీవితమును గడుపుచుండిరి. భార్యపోయిన ముసలివాడు కూడా చిన్నవయసులో ఉన్న ఆడపిల్లను పెళ్ళిచేసుకోవడం వల్ల వితంతువుల సమస్య పెరిగింది. అటువంటి పరిస్థితులలో యౌవ్వనంలో ఉన్న స్త్రీలు భర్తమరణంతో తృప్తి పొందని కోరికలతో జీవితాంతం వితంతువులుగా మార్చిన దురాచారాన్ని ఖండిస్తూ, తన రచనల ద్వారా జాషువా వితంతు వివాహాలను ప్రోత్సహించాడు. ఆనాటి వితంతువు భారతీయస్త్రీని గూర్చి జాషువా.

''అనివార్యంబగు యౌవనంబులికి సర్వాంగమ్ములన్ నిండి వె
చ్చని రక్తంబును రెచ్చగొట్టి మదురేచ్ఛల్ రేగి వేధింప తీ
రని వైధవ్యదవాగ్నిలోన బడి మర్మచ్ఛేదకంబైన వే
దన పాలై వ్రతముల్ పొనర్చెడు ననదా! నీకు శ్రద్ధాంజలుల్''

అని ఆవేదన వ్యక్తీకరించాడు.

## సతీసహగమనము :

ఆనాడు సమాజంలో ఉన్న మరొక సామాజిక జాఢ్యం సతీసహగమనము. భర్తమరణిస్తే భర్తతో పాటు భార్య కూడా చితిలోకి వెళ్ళవలసిందే. ఈ మూఢాచారాన్ని రూపు మాపుటకు బ్రహ్మసమాజ స్థాపకుడైన రాజారామమోహన్‌రాయ్ చాల కృషిచేసినాడు. నాటి ఆంగ్లవైస్రాయ్ బెంటిక్ కూడా చట్టాన్ని రూపొందించాడు. అయినప్పటికీ నేటికిని దేశంలో ఒక మూలకొనసాగుతూనే ఉన్నది.

ఆంధ్రలో కందుకూరి వీరేశలింగం పంతులు గారు దేశమంతట పర్యటించి దీనికి వ్యతిరేకంగా అనేక ఉపన్యాసాలు ఇవ్వటం జరిగింది. జాషువా కూడా హైందవ వ్యవస్థలోని సతీసహగమనాన్ని ఖండిస్తూ.

> 'పతిమరణింప నాతని శవంబునకున్ సతి
> నాట గట్టిన
> గ్గతిలభియించునంచు కనికార మొకించుక లేక,
> యగ్ని కా
> హూతి యొనరించుకొంటి. పురుషోత్తము
> డెన్నటికేని ఈసము
> న్నతికి ప్రసన్నుడై వదులునా చిరకాలపు
> టుక్కువగ్గముల్'

అని ఆవేదన చెందాడు.

## బహు భార్యాత్వం :

ఆనాటి భారతీయ వ్యవస్థలో నెలకొని ఉన్న మరొక సాంఘిక సమస్య బహుభార్యాత్వం. భార్య గొడ్డురాలనో అంగహీనురాలనో భార్యపోయినదనో అన్న నెపంతో భర్త రెండో పెళ్ళికి తయారయ్యేవాడు. ఈ దుస్థితికి గురియై అనాదిగా పురుషాధిపత్యానికి తలవంచి వంచిత అయిన హైందవ స్త్రీని గూర్చి "వంచిత" అనే ఖండికలో

> "పిల్లలేరని వంకబెట్టుకొని నీ ప్రేమన్
> విసర్జించి మా
> "రిల్లాలిన్ గొనివచ్చి నీదుతలపై నెక్కించి
> నీప్రక్కలో
> బల్లెంబున్ సవరించు దుష్టులకు బ్రాపై వచ్చు
> ధర్మాలెటుల్
> జెల్లన్ నేరవో నీవు కొండొక వతిన్ జేపట్టి
> పెండ్లాడినన్"

అని బహుభార్యాత్వం కోసం మగపుంగవులు పడే ఆరాటాన్ని భారతీయ స్త్రీలు పడే వేదనను వ్యక్తపరిచాడు.

## వరకట్న సమస్య

నాడు, నేడు కూడా సంఘంలో ప్రబలి యున్న దురాచారం కట్నములిచ్చు పద్ధతియొకటి. పెండ్లి కుమారునకు పెండ్లిసమయంలో పెండ్లికుమార్తె తల్లిదండ్రులు ఇచ్చు కానుకయే వరకట్నము కాలం క్రమమున నిది పెద్దమొత్తముగా నిర్బంధముగా మారి కన్యల తలిదండ్రుల పాలిట మహమ్మారిగా మారినది.

పెండ్లి అయిన తరువాత ఇచ్చిన కట్నములు లాంఛనములు చాలలేదని అత్తమామలను బాధించు అల్లుండ్రు వారి తల్లులు కలరు. ఈ వేధింపులతో వారికి డబ్బురానిచో కోడలును చంపడానికి కూడా వారు వెనుకాడుటలేదు. కొందరు స్త్రీలు అత్తవారింటి బాధలు పడలేక ఆత్మాహుతులు చేసుకొంటున్నారు. సంఘంలోని ఈ సంఘటనలకు వేదన చెందిన జాషువా.

> "పురుషుల్ నిర్మితిజేయు సాంఘిక మహా
> భూతంబు పెన్గోరలం
> దిరికింపంబడి దుష్టభర్తల కృపాహీన
> ప్రవృత్తుల్ హృదం

తరమున్ అంపపు కోతగోయ నిజహత్యా
నేరముల్ చేయు నుం
దరుల న్నివెటులూరడించునో మహాత్మా!
ప్రేమవారాన్నిధీ''

అని స్త్రీని సమాజం 'భార్యామణి'గా ఆమె కివ్వవలసిన గౌరవము ఇవ్వలేక పోతున్నదని వ్యధచెందాడు. ఇదే సమస్యను కాళ్ళకూరి నారాయణరావుగారు వరవిక్రయం నాటకంలో చక్కగా వివరించియున్నారు.

**విద్య :—**

స్త్రీలు విద్యావంతులైనచో సమాజము వివేకవంతమై ఉండును. పిల్లలను కని పెంచి పెద్దవారిగా జేసి తీర్చిదిద్దెడి తల్లులు విద్యావంతులైనచో సంఘం ప్రయోజనకారిగా ఉంటుందనే ఉద్దేశ్యంతో జాషుగా స్త్రీ విద్యను ప్రోత్సహిస్తూ 'మేలుకొలుపు' అను ఖండికలో ప్రబోధాత్మక గేయాలు వ్రాయడం జరిగింది.

జాషువా సామాజిక స్త్రీ సమస్యలనే గాకుండా స్త్రీ శ్రేయస్సును కాంక్షిస్తూ స్త్రీ సమాజంలో చైతన్యవంతమై జీవన ప్రస్థానానికి ముందుండాలని స్త్రీలకు హితవు చెప్తూ స్త్రీ స్వాతంత్ర్య ప్రబోధకాలు రచించాడు.

## ప్రబోధము:—

పురుషుని ఆధిపత్యదాస్యానికి గురియై ఒక విలాస వస్తువుగా పరిగణించ బడుతున్న భారతీయ స్త్రీ జాగృతిని పొంది చైతన్యవంతమై సమాజ శ్రేయస్సుకు పాత్రదారి కావలసిన అవశ్యకతను గూర్చి ఈ ప్రబోధగీతంలో ఉద్బోధించాడు.

## మాత:—

కన్న బిడ్డలను భావిపౌరులుగా తీర్చిదిద్ద వలసిన బాధ్యత మాతృమూర్తికి ఉన్నదని ఒకవేళ ఆమె బాధ్యతా రహితంగా వర్తించి నట్లైతే సమాజ అభ్యున్నతికే గొడ్డలి పెట్టని హెచ్చరించటం జరిగింది.

జాషువా సమాజంలో స్త్రీ వెనుకబాటుతనాన్ని గుర్తుచేసి జాగ్రత్తపడమని హెచ్చరించడమే కాకుండా స్త్రీ సమాజంలో వివిధరంగాలలో సాధించిన సాహసాలను, అభ్యుదయాన్ని ప్రస్తుతించటం జరిగింది.

## వీరచానమ్మ:—

ఖడ్గతిక్కన వీరభూమినుండి తిరిగిరాగా అతని భార్య భర్తకు నీటిని పసుపుముద్దను ఉంచి నలికి మంచము అడ్డముగా పెట్టినది. వగవారికి వెన్నిచ్చి తిరిగి వచ్చినటో వీరులు నవ్వుతారు ఇప్పుడు మీతో కలిపి మొత్తం ఈ ఇంట్లో ఇద్దరం ఆడువారమయ్యాము అని భార్య పలికింది'

ఖడ్గతిక్కన పౌరుషంతో రణభూమికి వెళ్ళి తన ప్రాణాలను పోగొట్టుకున్నాడు. చానమ్మ భర్త దమకమించింది ఇటువంటి వీరనారీమణి సాహసకృత్యమె జాషువా వ్రాసిన 'వీరచానమ్మ' ఖండికలోని ఇతివృత్తం.

## నేటి నెలత :

తన అభ్యుదయానికి అవరోధంగా నిలిచిన అంశాలను గురించి వాటిని ప్రక్కకు తప్పించి సామర్థ్యంతో ముందడుగు వేయుచున్నటువంటి మహిళను గూర్చి ఈ ఖండికలో ప్రస్తుతించటం జరిగింది.

## వీరకుమారి :

ప్రపంచంలో తొలిసారిగా రోదసి నౌకలో గగన విహారము చేసిన రష్యన్ వీరకుమారి వాలంటీనా తెలిస్కోవా' లోకోత్తర వీరకృత్యాన్ని మెచ్చుకొంటు ప్రశంసాత్మక పద్యాలు వ్రాయడం జరిగింది పురుషులతో స్త్రీలు ఏ మాత్రం తీసిపోరని అన్న విధంగా సాహస కృత్యాలను చేసిన స్త్రీల పట్ల జాషువాకున్న అభిమానానికిది నిదర్శనం.

జాషువా తన సంఘ సంస్కరణ కవిత్వంలో భాగంగా నాటి సాంఘిక స్త్రీ సమస్యలను నిరసిస్తూ ఆవేదన వ్యక్తం చేయడమే కాకుండా అభ్యుదయ స్త్రీలకు అభినందన చందనాలు కురిపించాడు.

# కవితావీథి

## రా మా యా ణ ము

ఊట్ల కొండయ్య

### షష్ఠ సర్గము

ఎడపెడ ధారల నడచెన్
గడగడలాడించె నా ఘనాఘనతతు ల
వ్వడవున పుడమిన్, బెగ్గిలి
గడగడ యిల వడక దొడగి వడిముడుగబడెన్. 1

పారునీటి వెల్లువల దుప్పటుల యొడలి
నిండ గప్పికొనుచు కూరుచుండె నచలః
సాల నెగడి వెల్గించిరి శాన ఓదులు
వదనముల కాంతి విసరము కదలియాడ. 2

చెట్టుల చేమలన్ గజిబిజిన్
విహాగమ్ములు కాందిశీకలై
యిట్టటు పర్వుచున్ చొరగ నెందును
గానక, వృక్ష శాఖలన్
పట్టి ముడుంగుచో, సకల పర్ణములన్
ఫలముల్ నవమ్ములై
పుట్టిన యట్లు తోచె కుజముల్,
జడిజల్లుల వల్వశావేన్. 3

పిడుగు పాత తెగిరివచ్చు వెరపుతోప
నచటి కాకముల్ విజనములైన పంచ
పాళులన్ ప్రాలి యొదళులపై స్రవించు
నంబువు విదుల్చె రెక్క లల్లార్చుకొనుచు, 4

శునక మొక దిక్కున త్రవ్వికొని పరుండి
యుండి లేవదు కనియు నా యండజముల
పయి పయింబడి కూనలు పాలుద్రావ
నమ్మయర్మిలి లోకసర్వాధికమ్ము. 5

ఒక్క మార్జాల మరుదెంచి యెక్కగదవ
కొసరి గుర్రనె కని దాని కుర్కురమ్ము
నొక్క యుదుటున నది వెనుచక్కి దూకె
వర్షభయము కంటెను ప్రాణభయము మిన్న. 6

ఆటవీ గర్భమునన్ వనేచరము లయ్యో
వాసముల్ వెల్లిజి
కుక్కుటతో శైలఖిలాబి రక్షణమునన్
గుప్తించి దేహమ్ము లు

కుత్బిగూడ, హైదరాబాదు–500 027.

త్కటవైరమ్ములు మా రణక్రియల
ప్రస్తావించ తప్పట్టునన్
నటియించెన్‌క్షమ, చిర్రుబుర్రులను
మించంజాల కాపన్నతన్

మేతకై యడవులదరి మేయు గోవు
లొక్క పెను మ్రరి దాపున నొదిగి యుండి
కావతులగూడి, వత్సములో తసల వడిన
తెరగు తోపగ నిండకు మరల సాగె.

కాపరుల్ నీరు కారుచు కాళ
కొనుచు వణకుచు గోవుల ననుసరింప
నాలసాలల క్రేపుల యరవులినె
ప్రతిరవమ్ము మొదవులయంభారవముల 9

పలుచ బడె వాన. యజ్ఞనపదులు లేచి
పసుల కొట్టములం గట్టి వచ్చిచేర
నమ్మహర్షి చూప వ్వారియతులందు
గ్రుచ్చి చూచుచు కరుణ వాక్రుచ్చెనిట్లు. 10

మీ ధర్మ శ్రవణాభిలాషరుచి
యుస్మీలించు మీయంతరం
గాధారాత్మ సహస్ర వ్రతముల,
తోకాంక్షం బు సంస్పర్శను
ద్బోధమ్మందుకు లేక యమ్మ్మల
క్రియన్, దోదూయమానమ్మునన్
బోధింపన్ కలదేమి మీ కయిన
నొప్పన్ జెప్ప సంతుష్టికై. 11

ప్రవచింపు మంత్రము, సత్యం
బువచింపన్ జనులు చిన్న బుచ్చుకొనెద రీ
భువి మనుజుని జననము సుత
కవి బుషులు సుచర్యా వేముఖముల గరపరే! 12

జనను జీవితున్ మలిన సుంటుచునే
చనునెంత చేసినన్
మేను మలమ్ము జేయ సమ సత్యమొ
కర్మలమున్ ఎహింటుట న
ట్టానను కొందు జీవనమ్ము నలదుచు,
నెరులలటులన్
మానసమున్ విశుద్ధము నొనర్చుట
కర్లను లోని మాపుతోన్. 13

గృహమే సర్వధర్మమ్ముల కిరవుసుమ్ము
ధర్మదీపవు కుందెన ధర్మపత్ని
యామె సుచరితమే వానికగుచు తైల
మట్లగుట నామె గృహలక్ష్మియనిరి బుధులు. 14

పేదరికమ్మనన్ కలుగు పెద్దరిక
మ్మొకచో, దురంతము
ర్మాదను నొందుచో మనుజ
మానస వృత్తుల, న్నిపవృత్తి నిం
ద్రాదిగుణ ప్రహృష్ట మగు టారయ
భాగ్యముకాదె యింతకీ
యైదువరాండ్రు చద్దుబడి యట్టిటి
కావలె దాపురమ్ములన్. 15

ఎట్టి దనుజుడయ్యె నెంతటి నుదయ్యె
కరగు వెన్న బొమ్మ తరణి నరుడు
ప్రణయ మృదు కదుష్ట రమణీ తరస్పర్శ
పంచభూత శక్తివంతమద్ది. 16

ఈనైజ బలము కల్గియు
మానిను లసహాయలై యమానుషములకున్
లోనయి, యబలలము, నొసట
నా నలువ లిఖించె నిటులని కుందుదురే! 17

తన యెడల పతివ్రతకు, సంతానవతికి
తప్పి, యప్రీతి మృత్యు శీఘ్రమున గద్ద
గట్టు నీర శైవపు వాడె గ్రామ బాహ్యు
డతడె యస్పృశ్యుడు పంచ్యుకట్టివాడె 18

అనముని, యందు నున్న జవరాండ్రకు
కన్నులు పూర్ణచంద్రులా
యెను, దరహాస కౌముదుల నింపులు
నింపుకొనంగ విప్రసాం
గనల ముఖమ్ము లా యువ జనమ్ము
మనమ్ములు దాచుచున్నటుల్
కనులిలజూచె, విన్నసతోలనగ
వృద్ధుల నవ్వు మోములన్ 19

అప్పు డా గ్రామణి యంజలించి మునికి
విన్నవింప నొకటి నేశిసుడివె
స్వామి! నెక్కొనియె దౌర్భాగ్యవశము నా
వంటి యుదంతే మీ పల్లె మీద
నితని పూర్ణ సతియు, నీపె పూర్వ్వధవుడు
గ్రామబాహ్యులయి న కతమున కలిగె
నీమె యీతని బిడ్డ మా మాయనుచు పే
ర్కొనువాడు జనయితయనుచు వీని

వాడు నామెయు నిక పక పకలుగ
నున్న వ్యథా భావింప కన్నచెల్లె
సరసమని యెంచిబారల బాయబోరు
కనియు వినియు గ్రామస్థు లొక్కరుసు కూడ20

అందరము కర్షకులమె, సస్యావసులకు
నడపు బుతు చర్య నొక్కింత వడి వ వళ్ల
రేలునున్ పరిచర్య వర్తింప నోపు
నట్టియెడ పాపమిట్టిది పట్టెమమ్ము 21

ఈతని పరోక్షము వ్వారి యింగితములు
నేక మొనరించి పానుపు దాక నడపె
నట్టి దొకవాడితనికి కన్నట్టి నెత్తె
గంధ గొడ్డరి ఖండించు గాక యనుచు. 22

చేరిరి పల్లియ పెద్దలు
వారించిరి మల్ల యోధవరు నీతని, న
వ్వారల వెడలన్ ద్రోసిరి
కారడవులకంత దనుక కానము వారిన్. 23

మామయును కోడలును మోడు మ్రాకులట్లు
కాలవశి నొంటరిగ నుంట గాంచలేక
తోడు జేసితి మీ జంట మూడు ముడుల
క్రొన్ననలనెత్తి నెసరు లిరులు ధరింప. 24

అను చా గ్రామణి నన్నే
మునియాజ్ఞాపింతురో మహాత్మ ! యెరుంగన్
మనసాత వడెడునన
మ్ముని యాతని జూచి నగవు మోమునన యెన్

కీలెరిగి వాతబెట్ట కల్గితివయేని
కీడు మున్నెంచి మేలెంచు వాడవేని
నీకు జయమగునయ్య యన్నిటను పుత్ర !
వలదు స్వపర భేదములకు నెలవు దీన. 26

అను చుండన్ ముని తంతు వాయుడొక
డిల్లాలున్ సుతుల్ వెంటరా
చనుదెంచెన్, చరణాల సాగిలబడెన్,
చర్మోవ జీవుండొకం
డపుసారుండయి వానికిన్ సతియు
సంతానమ్మునున్ తోడరా
ముని పాదమ్ములవ్రాలె, నిచ్చె నభయమ్మున్
మౌని చేయెత్తుచున్. 27

# అతడెవరైతే నేం?

కనపర్తి రామచంద్రాచార్యులు

మోచేతుల్దాకా మలచుకొన్న
మాసిన కమీజు
మోకాళ్ళమీద చినిగిపోయిన
దిండులాగు—
బేతాళ శవంలా బుజాలపైన
గోనెసంచి:
ఏ స్వప్నాలనో పోగొట్టుకొన్నవానిలా
వేయివళ్ళతో వీధివీధీ వెతుకుతుంటాడు;
అతడెవరైతేనేం?
శిథిల విపంచిలాంటివాడి కంఠం విన్పిస్తే
గూటిలోని చిత్తుకాగితాలకు
గుండెలు ప్రతిస్పందిస్తాయి:
చెత్తకుండీల, చౌరస్తాలు
ఒక్కసారి ఒళ్ళు విరుచుకొంటాయి!!
నిజం చెప్పాలంటే—
తెల్లకాగితం నన్ను చూసి పులకించిపోయినట్లే,
పాతపేపరు వాణ్ణిచూసి పరవశించిపోతుంది
వాడిపేరేమైతేనేం,
రాతకాకపోయినా
రాసిన కాగితాలకోసమే తపిస్తాడు:
అందుకే—

అక్షర గ్రామాల్లో సిరాసిక్తమై,
నడిరోడ్డుమీద
నల్గిరి కాళ్ళక్రింద నలిగిపోయే కాగితాలు-
వాడి హస్తస్పర్శకు నోచుకొంటాయి!
నిన్న కన్నుమూసిన వార్తాపత్రిక.
మొన్న కాలంచెల్లిన వారపత్రిక.
కొట్టివేతలతో చిత్తయిపోయిన కవితాఖండిక,
అన్నిటికీ 'వర్ణభేదమెరుగని
వాని సంచిలో స్థానమే!
అతడెవరైతేనేం!
మనుషులంతా 'పచ్చకాగితాల'కోసం
పచ్చినెత్తురు త్రాగుతుంటే—
పిచ్చివాడు
చెత్తకాగితాలకోసం చెమటోడుస్తాడు
మన కాగితాల బ్రతుకంటే-
వాడి కాగితం బ్రతుకే గొప్ప!

పాత గంజు వీధి, సిద్దిపేట—502103.

రెండు కవితలు:

# ఉషస్సుని పిండుకొనే లక్ష్యంతో....

సంపతి బాల్ రెడ్డి

మొగ్గ మొగ్గలో చైతన్య పరిమళాల్ని నింపి
కాంతిపూలుగా వికసింపచేస్తూ హృదయపూర్వక సేవతో
పూదోట అందాల్ని పులుముకొంటూ పునీతమవుతున్న వనమాలిని నేను!
ప్రకృతిలోని ప్రతి అణువూ ప్రకటించే
పరమార్థపు సందేశాన్ని ప్రాణప్రదంగా వదిల పరచుకొంటూ
ఆచరణ సాధ్యమైనవి అనుభవిస్తూ అనుభవింపచేస్తున్న అనుభవజ్ఞుణ్ణి!
చీకటి భూముల్ని విజ్ఞానహలాన దున్ని
అభ్యసన సూత్రాల సాధనలతో సవ్యంగా సేద్యంచేసి
చెక్కు చెదరని చిక్కని చుక్కల పంటల్ని పండిస్తున్న అక్షర విద్యాహాలికుణ్ణి నేను
తీగలు తెగుతున్న మానవతా వీణని సవరిస్తూ
మాయని మమతా సరిగమల మధుర సరాగమాలను కూర్చి
సమతా సంగీత చైతన్య సుధల్ని జాలువారుస్తున్న జాలిగుండె సంగీత ప్రాజ్ఞుణ్ణి
అనంత విశ్వరహస్యాల్ని నిరంతరం శోధిస్తూ
అసాధ్య విద్యల్ని సైతం అవిశ్రాంత సాధనతో సమకూర్చుకొంటూ
విజ్ఞాన భాగ్య విధాతనై విప్లవిస్తున్న విశేష విద్యా ప్రగతి మార్గదర్శకుణ్ణి
అర్భక విద్యార్థుల అమాయక మెదడు బీడుల్లో
అక్షర బీజాల్ని విత్తి ప్రాయానుగుణ ప్రశిక్షణా దోహదంచేస్తూ
అక్షర విద్యా సంపదలిచ్చి అలౌకికానందం పంచుతున్న అధ్యాపకుణ్ణి,
తెలిసినకొద్దీ తెలియనివెన్నో తెప్పలు కుప్పలుగా

పోస్టు: ముస్తాబాద్, కరీంనగర్-505 404.

తేటపడుతున్నాయి కనుక తెలియనివి తెలుసుకొంటూ
విధిగా ఎప్పటికప్పుడు తెలియ చేస్తున్న నిత్యనూతన విద్యార్థి అధ్యాపకుణ్ణి।
అధ్యాపక వృత్తికి అంకితమై అనుదిన జీవితానుభవాల్ని
అనుశీలిస్తూ అధ్యయన ఫలితాల్ని అందిస్తున్న అభినవ అధ్యాపక విద్యార్థిని॥
బడబాగ్నుల్ని భరిస్తూ భయంకర మౌనాన్ని
భారంగా భావన చేస్తున్న సంద్రుడి గంభీర ముద్రా సంపదని
గంభీరంగా మచ్చిక చేసుకొని కాలంగడుపుతున్న ధీర గంభీర పట్టభద్రుణ్ణి॥
ఎదుగూ బొదుగూలేని గొంగళి పురుగు బతుకు నావ
భయంకర సంసార సాగరంలో బలవంతంగా నెట్టుకొంటూ
తపహృదయ నిశ్శబ్ద నీరవాన్ని నిశ్శబ్దంగా భరిస్తూ
నిశీధి సామ్రాట్టునై నిర్నిద్రా ముద్రల్ని ఆవులిస్తూ
ఉషస్సుని పిండుకొనే లక్ష్యంతో
ఉద్యమిస్తున్న ఉపాధ్యాయుణ్ణి॥

## అపర సపర జాడలై....

తెలిసినకొద్దీ తెలియనివాడిలా
తెలియని మనసు లోలోపలి లోయల్లోకి
చీకటి పెనుపొరల్ని చీల్చుకొంటూ
చిన్మయ గర్వముద్రతో చిద్విలాసంగా
కీర్తిశిఖరాల అగాధాల్లోకి ప్రగతిలా కూరుకుపోతున్నాను।
మనోవేగ మహాలోచనా వాహనాల్లో కూర్చొని
మధ్యాకాశ వీధుల వీధుల్లో పయనిస్తూ
అనంత విశ్వరహస్యాల రహస్య ఛిద్రాల్ని శోధిస్తూ
అనాది కేంద్రంకేసి ఉల్కలా దూసుకుపోతూ
భయంకరంగా బ్రద్దలవుతున్నాను॥
భయంకర భయాలకు భయంభయంగానే అభయమిస్తూ
భరించలేని ఆగ్రహావేశ కావేశాలకులోనై
బతుకు పరమార్థపు టీపిలో బలవుతున్నాను॥
ఆది మధ్యాంత రహిత విశ్వతత్వాన్ని తేల్చుకోలేక

ఆదిమానవుణ్ణే ఆదిగురువుగా గుర్తించి గురితో
ఆశ్రయిస్తున్న నిత్య ఆధునిక శిష్యపరమాణువుని!
అనుదిన మనోవికాస క్రమగతిలో అజ్ఞాతంగావున్న అజ్ఞుణ్ణి!
దాపకింది నీరులా వెంబడిస్తూ వెక్కిరిస్తున్న
నా పురోగమనంలోని తిరోగమనాన్ని తిలకిస్తూ కూడా
మౌనాన్ని మౌనంగా భరిస్తూ స్మశాన శాంతిలో
మాననీయమహాతృప్తినిఏదుకొంటూకృత్రిమంగాబతుకుతున్నవాణ్ణి
చితికిన అతుకుల సంస్కృతీ తెరచాప జీవితనావలో
అవిశ్రాంత ఆధునిక సంసార సాగరయానం చేస్తూ
తీరంచేరలేక ఇంకా తిమిరంతోసమరంచేస్తున్న పండితపామరుణ్ణి।
భవిష్యదాశా కౌగిళ్లలో ఆనందపు వెలుగురేఖల్ని బంధిస్తూ
వర్తమాన దినాల కరకు గుండెలకు కాళరాత్రుల్ని ఆలవాలంచేస్తూ,
భయంకర బతుకు పోరాటపందాలను నిర్వహిస్తూ కాలం–
కనిపించినట్లే కనిపించి కనిపించకుండా కరిగిపోతోంది॥
గంభీరాన్ని ముద్రిస్తూ కాలం గడిస్తున్నా
మానవతా శిఖరారోహణా ప్రయత్నంతో
శాంతిని స్వప్నిస్తూ జీవిస్తున్నవాణ్ణి।
అయినా గతించని జ్ఞాపకాల నీలినీడలు అమరసమరజాడలై
కుటిల కులమతాచార రాబందులు
నన్ను వెంటాడుతూ ఇంకా వేటాడుతూనే ఉన్నాయి!।

# మేధావి

ఎర్రోజు వెంకటేశ్వర్లు

మట్టి బంగారానిస్తూ సువాసనల్ని వెదజల్లుతోంది
మాణిక్యం కాంతిపుంజాలను పూయిస్తోంది
మంచు తాను కరిగి మంచినీటినిస్తోంది
లత ముళ్ళపొదలను ఎదను హత్తుకున్నా
హాయిగా సుమాల సుగంధాల్తో నవ్విస్తోంది
వెర్రిబాగుల సూర్యుడు కిరణాల్ని ఏ మాత్రం
దాచుకోక చంద్రుడికి, కమలాలకు ప్రాణం పోస్తున్నాడు
సముద్రం బడబాగ్ని గుండెలోతుల్లో మండుతున్నా
మేఘాలకు నీరందిస్తూనే ఉంది
మూఢభావాల కాంక్రీటు రోడ్డును
నిరోధకాల్లేని ఆలోచనల్తో అధిగమిస్తూ
హితాన్ని, మతాన్ని పాలించక
గతాన్ని గాలికి వదిలేసి
అభ్యుదయం పేరుతో ఆటంబాంబులు చే(వే)సి
సమస్త ప్రకృతిని కలుషితం చేస్తున్నా డీ
కుహనా మేధావి...!

# మందార మాల

## చైతన్య సందేశం–మేఘదూత కావ్యం

సరస్వతీపుత్ర సార్థక బిరుదాంచితులు పుట్టపర్తి నారాయణాచార్యులు. వారిది బహుముఖమైన పాండిత్యము. రచనా వైవిధ్యం వారి సొత్తు. పద్యం గేయం వచనం యేది వ్రాసినా వారిది ప్రత్యేకతఒరవడి. దానికదే సాటియైన శైలి. ప్రతిభా వ్యుత్పత్తి నిఅభ్యాసమూ, ముప్పేటలుగా ఆయన నల్లుకున్నవి. సంస్కృతం ఆంధ్రం కన్నడం హిందీ ప్రాకృతం తమిళం మలయాళం ఆంగ్లం మొదలైన భాషల్లో కవిత్వం చెప్పగల దిట్ట నారాయణాచార్యులు

పుట్టపర్తి వారు 'ఆడెనమ్మా! శివుడు పాడెనమ్మా!' అంటూ తమ శివతాండవాన్ని సాభినయంగా గానం చేస్తుంటే సంగీత సాహిత్య నాట్యశాస్త్రాలకు భాష్యం చెప్పినట్లుండేది. నిజంగా శివమూర్తి తమ కళ్లముందు తాండవమాడుతున్న స్ఫూర్తి శ్రోతలకు కలిగేది. ఆయన మహాభారత విమర్శనము సముద్రమును మథించి సుధను సాధించినట్టిది. ఆచార్యుల పెనుగొండలక్ష్మికి ఒక ప్రత్యేకత వుంది. పన్నెండు సంవత్సరాలైనా దాటని వయస్సు, ఛందస్సు లగువు బింగువులు పూర్తిగా తెలియని దశలో వ్రాయబడిందీ కావ్యం. సంస్కృత విద్వాన్ పరీక్ష వ్రాస్తున్నపుడు ఆయనకే అది పాఠ్యగ్రంథంగావడం ఆయన సహజ పాండిత్యానికీ, ప్రతిభకూ ఉదాహరణ. ఆచార్యుల వారు స్వయంగా పలుమార్లు ఈ విషయాన్ని మధురానుభూతిగా అభివర్ణించేవారు. ప్రపంచంలోని మరే ఇతర సాహిత్యంలో ఏ వ్యక్తికీ ఈ అనుభూతి కలుగకుండవచ్చు.

సుప్రసిద్ధమైన ఎన్నో గ్రంథాలు పుట్టపర్తివారు వ్రాసినా మేఘదూత వారి కీర్తి కిరీటంలో కలికితురాయి అంటారు ఆధునిక సాహిత్య విమర్శకులు. కాలంతోపాటు మారుతున్న విలువలను ఆనాడే పసిగట్టి రానున్నతరాల అవసరాలకు వ్రాసిన కావ్యమా! అనిపించేది మేఘదూత. ఆయన క్రాంతదర్శి, దూరదర్శి అనడానికి అస్కారం కలిగించినది మేఘదూత. ఇది సందేశ కావ్య పరంపరలోనికే చేరినా విలక్షణమైనది కాళిదాసు మేఘసందేశం శృంగార, ప్రకృతి వర్ణనలకు పరిమితమైతే, జాషువా గబ్బిలం అస్పృశ్యతా వర్ణనలకు సీమితమయింది. మేఘదూత ఆంధ్రుల జీవనానికి వారి కష్టాలకూ, కలవారి స్వార్థాలకూ బలౌతున్న బక్క చిక్కిన వారి కడగండ్లకూ అద్దం పడుతుంది.

నారాయణాచార్యులు మానవతావాది. అభ్యుదయ కవి అణచబడిన సమాజ పునరుద్ధరణకు కపిగా తన వంతు కృషి సల్పినవాడు. తాడిత పీడిత ప్రజానీకం పట్ల, కర్షక కార్మిక వర్గాల పట్ల వారి సమస్యాపరిష్కారం పట్ల ఎంతో సానుభూతి కలవాడుగా మేఘదూత రచనలో కనబడతాడు.

తనవంటి మానవుల దైన్యమే సుఖకయ్యు
గా—వారి నిట్టూర్పుగాడుపులె చామరలు
గా—వారి కన్నీటగరగు దినముల పైని
నిలచి మేమూ మానవుల మంచు గొంతెత్తి
ఆర్చు ధనికుల జూని అసురులని.........

అన్నందుకే మేఘదూతలోని కథా నాయకుడు కారాగారంలో పడినాడు. అన్యాయాన్ని అన్యాయమనడమే వాడు చేసిన నేరం. ఆ నేరానికి బళ్ళారిలోని జైలులో గడుపుతూ శ్రీకాకుళంలోని ఒక మారు మూల పల్లెలోని తన ప్రియురాలికి మేఘం ద్వారా సందేశాన్ని పంపాలనుకున్నాడు. అవకాశంలో మేఘం కనబడగానే.

మనుజులను నేగోరలేనూ—శిలైన
మనసులకు నే పాడలేనూ
ఈసెరుగనట్టి జీస్సెసు రక్తము
పాశవమ్ముగమార్చె భూమినే ఈ జాతి
నా సఖుడ! విన్నావొ కావో! ఆ సోక్ర
టీసు జంపిన గాథలేవో
నశ్వరముగానట్టి విశ్వమానవమైత్రి
బోధ జేసిన యట్టి బుద్ధుడేమయ్యెనో!

అంటూ మొర పెట్టుకున్నాడు మేఘంతో ఈ ప్రపంచంలోని మనుషుల మనసులు శిలలైనాయి.

కరుణా జాలి మానవత్వం ఏ కోశానా లేవు. నిర్దాక్షిణ్యంగా తమ సోదరులనే చంపుతున్నారు.

అని నేటి విశ్వమానవుల స్థితిగతులను ఏకరువు పెడుతూ, నా కష్టాలకు మానవులైతే కరుగరు. కనీసం నీవైనా నా వార్తలు నా ప్రియురాలికి చెప్పమన్నాడు.

గతి తార్కిక భౌతిక వాదాన్ని అధ్యయనం చేసి, అవగాహన చేసికొన్నవాడు కాబట్టే నారాయణాచార్యులు కష్టపడేవారికి తగిన ప్రతిఫలం లభించడంలేదనీ, దాకిరొకరిది సౌఖ్యమొకరిదిగా సాగుతున్నదనీ, అలా జరగకూడదనీ ఆవేదన వ్యక్తపరచినాడు.

ఈ కావ్యంలో గ్రామజీవనం విపులంగా చిత్రించబడింది. గ్రామాల్లోని హరిజనులు మాలెతలు కమ్మరి చాకలి రైతులు లంబాడీలు కోయలు కంకర గొట్టే కార్మికులు మొదలైనవారి కష్ట నిష్ఠురాలు కళ్లకు కట్టినట్లుగా వర్ణింపబడినవి.

మేఘానికి మార్గనిర్దేశం చేస్తూ—

అటుచూడుమోయి! అక్కడిక మూనగదోయి
కంకరను కొట్టుచున్నాడూ—కడుపులో
డొక్కలేర్పడు పిల్లవాడూ
వాని కనుగ్రుడ్లలో కన్నీరు కొంచెముగదిగజారి
కాయగాచినవాని కరమునే గాల్చెను—

అంటాడు.

ఇంకా పక్కటెముకలే యేర్పడని పాలబుగ్గల పసివాడే కంకరకొడుతూంటే, చేతులు బొగ్గలెత్తి కాయలు కాస్తున్నవి. ఆ కాయలపై వాని కన్నీళ్ళే కారుతున్నాయి, చూడమన్నాడు. బాలకార్మికుల బాధలను చిత్రించడమే యిది.

పాలకై యేడ్చుచున్నాడూ—బుడతండు
పట్టుదలకెత్తుకొన్నాడూ—ఆతల్లి
చనుబాలనిచ్చునో తనయుకమ్ము జీల్చి ర
క్తంబులే దాపునో ధనికులేమెరుగుదురు!!

అంటాడు.

సమ్మెటను వేసీ వేసీ శరీరంలోని రక్తమూ మాంసమూ కరిగి చెమటై కారిపోయింది. చంటి వాడికి తావుదామంటే ఒక్క పాలచుక్కా లేదు. ఎదను చీల్చితే రక్తమూ రాదు. కమ్మరివాని భార్య దైన్యాన్ని చిత్రిస్తూ, దీనికి కారణం కలవారికి తెలుసునా! అంటాడు కవి.

తిండి కలిగితె కండకలదోయ్
కండకలవాడేను మనిషోయ్- అని కదా

మన పెద్దలన్నారు. మరి నేడు మనదేశంలో ఎంత మంది సంపూర్ణంగా ఈ అవకాశాలను కలిగి ఆరోగ్యంగా బలంగా ఉన్నారు, అని ప్రశ్నిస్తూ—

కట్టబట్టయు తిండి గతిలేనిదేశాన
పుట్టగొడుగులుగాక పురుషులెవరున్నారు—

అంటూ ఆక్షేపిస్తాడు! బలమే జీవనం. బలహీనతే మరణం. ఆ బలం తిండివల్లే వస్తుంది. ఆ తిండిలేనివాడు పురుషుడు- అంటే మానవుడే కాదని కవి తర్కం. వాస్తవం!

నిండుటాకలి దూయ
మండు టెండల కాయ
నడపీనుగుల వోలె నిలచీ శిరసుపై
కడు ధూళియును దుమ్ము బెరసీ కనపడెదు
హరిజనులపై సుంత యాదరము నీవైన
పరపరా! వారి నోదార్చు వారే లేరు—

అంటాడు.

దేశంలో కష్టజీవుల స్థితిగతులు కడుదైన్యంగా వున్నాయి. వారు నడ పీనుగుల్లా వున్నారు. మానవులైతే ఎలాగూ తోటివారిని పట్టించుకోరు సాయం చేయరు, సానుభూతి చూపరు. కనీసం నీవైనా కనికరించి, కరిగి, నాలుగు చల్లని చినుకులు వారిపై కురిసి ఓదార్చమంటున్నాడు కవి.

సాటి మానవులను మానవులుగా చూడలేని వారిని తిరస్కారంతో చూస్తున్నాడు.

సంపదలను సృష్టించేవారికి, వాని ననుభవించే అవకాశం లేకపోవడమే అన్యాయమంటాడు. పంటలు పండించేవారు వానిని తినలేని విచిత్రమైన స్థితి మనకుంటుందంటాడు.

[అదిగదిగో చాకితను చూడూ తెలిసీటి
యౌవనము చూపులకు సూడూ యంతైన
గట్టుకొనగా చెప్పగల బట్టయే లేదు—
కడుపు బిగువే లేదు కటిని బిగువే గాని—

అంటాడు చాకితను గూర్చి. మురికి బట్టలు, ఉతికి, కట్టుకోవడానికి అందరికి వస్త్రాలిస్తుందేగాని, ఆమెకే వొంటినిండా బట్టలులేవు. నడుం బిగించి కట్టి బట్ట లుతుకుతుందేగాని, కడుపులో 'అసదే' లేదని జాలిపడతాడు కవి.

వేశ్యల స్థితిగతుల గురించి జాలిపడుతూ కడుపునిండా తిండి వుండే, వారూ పాతివ్రత్యాన్ని గూర్చి ఉపన్యసిస్తారంటాడు.

మేఘమాతలో సందర్భానుసారంగా అక్కడక్కడా శృంగార వర్ణనలూ లేకపోలేదు. కావ్యమైనప్పుడు అన్ని రసాలనూ కలిగి వుంటే బాగుంటుందనేమో శృంగారానికి చోటు కల్పించారు

మత్తగజ గమనంబు నొరసీ మదిరాక్షి
మృదుగమనమును శిక్ష బెరసీ
అలతచన్నుల పైని తుంకిలించు బవరాలి
కలతనిద్దుర తేనె కలవోలె చిత్రముగ—
తలయెత్తి చూచి నవ్వాడూ ప్రియుకాలి
తలపోసి యేడ్చికొన్నాడూ—

అంటాడు.

మేఘదూత పూర్తిగా గేయకావ్యం. త్రిశ్ర చతురస్ర మిశ్రగతులు సందర్భానుసారంగా సాగుతాయి. నారాయణాచార్యులు శ్రావ్యంగా గానం చేస్తుంటే విన్న వారి అనుభూతులకు అవధులుండవు.

కవి క్రాంతదర్శి. భవిష్యత్తును సూచిస్తాడు.
ధనికవాదము గాదటనగా చీకటుల
దన్నితోసిరి బ్రతుకుచనగా
కడుపుగాలిన బీద కన్నీటితో నేడు
జలధులే పొంగెత్తి జగతులింకకపోవు

అంటాడు.

దేశంలో ప్రకృతి సంపద పుష్కలంగా వున్నా అది ప్రజలందరికీ అందుబాటులోలేదు. శ్రమశక్తి ద్వారా దాన్ని అందుకోవాలని ప్రయత్నించినా ప్రజల కది అందడంలేదు. నైసర్గిక సంపద అందరికీ అందుబాటులో వున్ననాడే సామ్యవాదం సార్థక్యం చెందుతుంది. అందరి శ్రమను కొందరే అనుభవించినప్పుడు వారిమధ్య అగాధం యేర్పడుతుంది. ఎడం ఏర్పడుతుంది అది సహజీవనానికి భంగం కలిగిస్తుంది. ఆగ్రహాలకూ, ఆవేశాలకూ, హింసకూ ఆలవాలమై జనజీవనం అల్లకల్లోలమౌతుంది. అట్లా కాకూడదనేది పుట్టపర్తివారి విశ్వాసం.

కావ్యం పాండిత్యమూ, వర్ణనలే కాదు, సామాజిక స్పృహ నేటి ప్రధాన అవసరం. అటువంటి సామాజిక చైతన్యదాయకమైన మేఘదూత వ్రాసిన పుట్టపర్తి నారాయణాచార్యులు ధన్యులు.

కవిని గన్నతల్లి గర్భంబు ధన్యంబు

డా॥ కె. రుక్నుద్దీన్
తాడ్నాకా, హైదరాబాదు.

# భారత స్వాతంత్ర్యోద్యమంలో ఆంధ్ర కవుల పాత్ర

భారత స్వాతంత్ర్యోద్యమంలో ఇతర రాష్ట్రాల ప్రజలతోపాటు ఆంధ్రప్రజలు సైతం విరివిగా పాల్గొని ఎన్నో త్యాగాలు చేసిన సంఘటనలు చరిత్రలో నిలిచాయి. ఆంధ్రులు ఉద్యమస్ఫూర్తి, దేశభక్తి నింపుకొని ఏకదేశీయతా భావాన్ని వర్ధిల్ల జేశారు. అసంఖ్యాక భాషలు, మతభేదాలు, పలుజాతులు—ఈదేశంలో ఉన్నా రాజకీయంగా అందరమొక్కటే అనే భావాన్ని వ్యాప్తి పరిచారు. దేశం ప్రజలందరిదీ, తమదేశాన్ని పాలించుకొనే హక్కు ఈ దేశవాసులకే ఉంది. ఆక్రమించుకొన్నంత మాత్రాన ఆంగ్లేయులకు పరిపాలించే హక్కు నైతికంగాలేదని ప్రచారం చేసిన వారిలో ఆంధ్రులూ ఉన్నారు.

బ్రిటిషువారి పాలనలో దేశంలో కలతలు వ్యాపించగా కల్లోలాలు పెల్లుబుకగా సహజంగా ఆంధ్రుల హృదయాలు బాధాతప్తమయ్యాయి. వజ్రసంకల్పంతో తెల్లవాళ్ళపాలనను ఎదుర్కొనేందుకు ఆంధ్రజాతి సమాయత్తమైంది. ఇందుకు ఆంధ్రకవుల ఎనలేని ప్రోత్సాహం ప్రశంసనీయంగా తోడైంది. ఆంధ్రకవులు, పండితులు జాతీయభావనను పెంపొందించడం కోసం తమ కలాల్ని కదిలించారు. ప్రజల్ని స్వాతంత్ర్యోద్యమోన్ముఖులు చేయడానికి తమ ప్రతిభను, పాండిత్యాన్ని వినియోగించారు. పర్వతనిర్ఝరంలా వేగం; శక్తి. సౌందర్యం వారి కవిత్వానికుంది. అనైక్యం, పరస్పర ద్వేషం విడనాడండని వారు ప్రజల్ని కోరారు. జాతీయ గౌరవ సమర్థనకు అపూర్వమయిన జీవం పోశారు. మాతృదేశ స్వాతంత్ర్యం కోసం సర్వం త్యజించండని

ఉద్బోధించారు. త్యాగాలకు వెనుకాడకన్నారు ఇలాంటి భావాల్ని ప్రతిబింబిస్తూ దేశభక్తి పూరిత కావ్యాలు, కవితలు జనాకర్షకంగా రచించారు. శత్రువుల నెదిరించి పోరాడిన రాజపుత్ర వీరుల కథల్ని కావ్యాలుగా మలిచారు. ఈ విధంగా తమ రచనల ద్వారా దేశ ప్రజల్ని ఉత్తేజితులు చేయడంలో తెలుగుకవులు ఇతర రాష్ట్రాలవారి కెంత మాత్రం తీసిపోలేదు.

**1905**లో బ్రిటిషు ప్రభుత్వం వంగ దేశాన్ని రెండుగా విభజించింది. భారతీయుల కీ సంఘటన బాధాకరమై పరిపాలన పట్ల తీవ్రక్రోధాగ్నిని రగుల్కొల్పి జేసింది. బిపిన్ చంద్రపాల్ ఈ సందర్భంగా తమ ఉపన్యాసాల ద్వారా దేశీయుల్ని ఉత్తేజపరుస్తూ కలకత్తా నుంచి ప్రయాణం చేస్తున్నారు. ఆయన విజయనగరం, విశాఖ మీదుగా రాజమండ్రి చేరుకొన్నారు. ఉత్తమ దేశభక్తుడు. ఆంధ్ర కవి పుంగవుడయిన శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహం అక్కడ బిపిన్ చంద్రపాల్ గారి మహోద్యమ స్ఫూర్తి, దేశభక్తి నిండిన ఉపన్యాసం విన్నారు.

అక్కడే–

''భరతఖండంబు చక్కని పాడియావు
హిందువులు లేగదూడలై యేడ్చుచుండ
తెల్లవారను గడుసరి గొల్లవారు
పితుకు చున్నారు మూతులు బిగియగట్టి''

అనే పద్యం వ్రాసి చదివారు. విన్న ప్రజల హృదయాల్లో జాతీయాభిమానం పొంగిపొరలింది. అసంఖ్యాక ప్రజల నాలుకలపై ఆ పద్యం నాట్యమాడింది.

మంగిపూడి వేంకటశర్మగారు **1912**లో మాతృభూమిపై కల తమ అపారభక్తిని క్రింది విధంగా వ్యక్తం చేశారు–

నేను విదేశాల్లోనూ, సుందరోద్యానాల్లోనూ
విహరించుచున్నను, వేవేగమునను
నా జన్మభూమికి నన్ను గొంపోవ
వాయువునకు నేను స్వాగతం విడుదు'' అని

గాంధీమహాత్ముడు సత్యాగ్రహం ద్వారా అఖండవిజయం సాధించగా శ్రీగరిమెళ్ళ సత్యగోదావరీశర్మ మహాత్ముని సత్యాగ్రహ సాధనాన్ని **1919**లో ఇలా కొనియాడారు–

''ఆర్యసోదరులారా సత్యాగ్రహంబు
పరమపావన మాత్మీయ బాంధవంబు
వేదశాస్త్రోక్త మీ వ్రత నిరతులైన
వారికెందునసాధ్య ముర్వరను లేదు''

దేశాభిమానం, ఆంధ్రాభిమానం వెల్లివిరిసేలా కవిత్వం వ్రాయగల వారిలో రాయప్రోలు సుబ్బారావుగారి కగ్రస్థానముంది. వారి దేశభక్తి గేయాలు, పద్యాలు ప్రజల హృదయాల్లో ఎప్పుడు చోటు చేసుకొని ఉంటాయి.

''ఏదేశ మేగినా–ఎందుకాలిడిన
ఏపీఠ మెక్కినా–ఎవ్వరేమనిన
పొగడరా నీతల్లి భూమి భారతిని
నిలుపరా నీజాతి నిండుగౌరవము''

భారత జాతీయ ప్రబోధం కావించిన ఈ గేయం ఆచంద్ర తారార్కం నిలుస్తుంది. రచనలోని చక్కదనం, భావాన్ని పెనవేసుకొన్న కమ్మదనం మనసుల్ని దోచివేస్తాయి.

కవికోకిల దువ్వూరి రామిరెడ్డి దేశ ప్రజల్ని తమ కవితల ద్వారా చైతన్యవంతులు చేశారు. ఈయనకు గల స్వచ్ఛంద ఆశయాలు, స్వాతంత్ర్యాను రక్తి, విశ్వజాతీయతాభావం తమ రచనల్లో అఖండంగా వ్యక్తమయ్యాయి. 1918-21 మధ్యకాలంలో వ్రాసిన 'సంధ్య' శీర్షికలో క్రొత్త భావాలు, నడకలు కల పద్యాలున్నాయి. ఒక పద్యంలో భారతీయుల్ని తుమ్మెదలుగాను, పద్మ శృంఖలాల్ని పాశ్చాత్యులుగాను చిత్రించారు. పారతంత్ర్యాన్ని నిరసించారు. కవితాకళా పుష్టిని, స్వాతంత్ర్యాను రక్తిని నింపుకొన్న ఆ పద్యం క్రింది విధంగా ఉంది—

'ఎప్పుడు గాఢ సంతమస మీవసుధన్విడు,
ప్రాచ్య దేశమిం
కెప్పుడు శోణితార్ద్రరుచి నింపును దిక్కును,
బాలభాస్కరుం
డెప్పుడు పూర్వమట్టుల రహించు ప్రతాప
సముజ్జ్వలంబుగా
నెప్పుడు మానునోజల శృంఖలజరాయడి
బంభరాళికిన్'

'స్వాతంత్ర్యరథము' అనే శీర్షికలో స్వాతంత్ర్య లక్ష్మిని కన్నులకు కట్టించినట్లు చిత్రించా రీకవి. ఆ రథానికి అశ్వాలులేవు. మత్తకరులు లేవు. ప్రజలే ఆ రథపు మోకునుబట్టి లాగేవారు. కాగా

'తేరు జాడల నెత్తురు పారి పారి
బంగరుపు పంట పండించె నొక్కనేల
చక్రనేములు తాకిన స్థలములెల్ల
సస్యలక్ష్మికి కళ్యాణశాలలయ్యె'

అనే ఈ పద్యంలో భారత స్వాతంత్ర్యరథము తన మహాత్మ్యాన్ని ప్రదర్శించింది ఉత్తమ కవితా కళాశిలి అయిన శ్రీరామిరెడ్డి రచనల్లో ఇలాంటి పద్యాలు కొల్లలు.

పారతంత్ర్యంలో భరతమాతపడే అవస్థను గమనించారు. శ్రీ డి. సీతారామరావు, తాము 1920లో రచించిన 'సింహపీఠి' అనే ఖండికలో భరతమాతను క్రింది విధంగా ఊరడిస్తున్నారు—

"నీవు స్వరాజ్యపీఠిపై నిలువగలవు
పూర్వపు మహా విభవమును పొందగలవు
లేదు సంశయం బింతయు లేదు లేదు
భవ్యగుణ గణోపేత మాభరతమాత"

ఎంతక్లిష్ట భావాన్నైనా చక్కగా పొదిగించి పద్యం నడిపించగల సమర్థుడు శ్రీవేదుల సత్యనారాయణశాస్త్రి. వీరి 'కాంక్ష' అనే శీర్షికలోని పద్యాలు మాతృదేశంపై భక్తిని ప్రకటిస్తున్నాయి. తానే పూవై కవి పలికే పలుకులు పాఠకుల మనసుల్ని స్వాతంత్ర్యాను రాగరంజితం చేస్తాయి.

పేదల రక్తమాంసాల్తో పెంపు వహించి దయారహితంగా ధనవంతులు తమ పెద్దరికం కోసం మతోన్మాదం పెంచే దేవునికి ప్రతిగా నిల్చిన రాతిబొమ్మలందు పరితపించే పాడుబతుకును ఒక క్షణకాలమైనా సహించననే శ్రీవేదులవారి క్రింది పద్యం గమనించండి—

"పేదల రక్తమాంసముల పెంపు వహించి
దయారసామృతా
స్వాద దరిద్రులైన ధనవంతుల పె
ద్దరికమ్ముకై, మత
న్మాదము పెంచు దేవునికి మారుగనిల్చి
రాతిబొమ్మల
దూపరపోవు పాడుబ్రతుకొక్క నిమేషమ
సైపనాయెదన్

పారతంత్ర్యంలో నీచపు బానిసత్వాన్ని సహించను. మాతృదేశ సేవకై ప్రాణాలర్పించిన మహనీయుల రక్తపు కాంతుల్లో వికసించి సువాసనలు వెదజల్లే వారి సమాధిమృత్తికలో జన్మను ధన్యం చేసుకుంటాను అనే భావంకల పద్యం.

"నీచపు దాస్యవృత్తి మననేరని భారత మాతృదేశ సే
వాచరణమ్ము నందసువు లర్పణ జేసిన వారి పార్థివ
శ్రీచెలువారు చోట దదసృక్కుసుమంబులన్ వికసించి వాసనల్
పీచుమరాలి పోవగవలెం దదుదాత్త సమాధి మృత్తికన్"

ఇట్టి పద్యాలు శ్రీ వేదుల కవితాసృష్టికి ఉత్తమ నిదర్శనాలు

శ్రీ గుఱ్ఱం జాషువా కవిత హృదయాల్ని కదలిస్తుంది. వీరి దేశభక్తి కవితలో భావశబ్దబలత, శబ్దవిన్యాసం అనుభవ తీవ్రత నిండుగా నెలకొని ఉంటాయి. కాంతులు వెదజల్లే రమణీయ అక్షర దీపావళులు జాషువాపద్యాలు.

"సింధు గంగానదీ జలక్షీర మెపుడు
కురిసిబిడ్డల పోషించు కొనుచునున్న
పచ్చిబాలెంతరాలు మా భరతమాత
మాతలకు మాత సకల సంపత్సమేత'
అని భరతమాతను అభివర్ణించారు.

స్వార్థపరుల ఆటల్ని అరికట్టి దేశగౌరవాన్ని 'నిలుపు కొమ్మని'

కులమతాల దొడ్డగుండాలు ద్రవ్వించు
స్వార్థపరుల దాడి నరికట్టి దేశంబు
పరువు నిలుపుకొమ్ము భరతపుత్ర

అని సైతం హెచ్చరించారు జాషువ.

బహుదేశముల మహాపరిషత్తు తలయూచ
పలికి వచ్చినది మా భరతసుతుడు'

వంటి పద్యాల్లోనూ

'చెర్చిపై కన్నెఱ్ఱజేయు హైందవుని సం
ధ్యావందనమున కర్థంబుగలదె?
దేవాలయమును నిందించు సాహెబుగారి
ఏకాంత పూజ అల్లాకు సుఖమె?
పరుల దోషముల నల్లరిజేయు క్రీస్తుతో
ధరణ భావల పారదైసు కలదె?'

వంటి పద్యరత్నాల్లోనూ శ్రీ జాషువ నిండు హృదయంతో ఆసించిన దేశభక్తి, ఉదాత్తభావం, సంస్కారజాలిజాష తొణికిసలాడుతున్నాయి.

తీయని మెత్తని పదాలను ప్రయోగించి వినూత్న భావాలతో కవిత్వం వ్రాయగల నేర్పరి శ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రి వీరి కవిత్వంలో దేశభక్తి నిండుగా సాక్షాత్కరిస్తుంది.

వీరు 'స్వేచ్ఛా పుష్పాలు' ఖండికలో స్వాతంత్ర్య పిపాస వ్యక్తం చేసిన విధానం పాతదైనా క్రొమ్మెరుగులు దిద్దుకొంది. వేదుల సత్యనారాయణ శాస్త్రిగారి కన్నను సులలితంగా పుష్పాం కోర్కెను—

'శాంతి పూర్ణ సత్యాగ్రహ సమరమందు
జీవితమ్ము నర్పణ సేయునట్టి
ధన్యమూర్తులు నడచెడి దారులందు
కాపురము సేయగా కోర్కెగలదు మాకు'

అని వివరించారు.

కరుణశ్రీగారి 'ధనుర్భంగము' అనే కవితా ఖండికలో శ్రీరాముడు శివధనుస్సును విరిచి జానకిని పరిణయమాడడం ఇతివృత్తం. ఈ కథలో కవి జాతీయభావం అందంగా పొదిగారు. శివధనుస్సును శ్రీరాముడు విరిచేసమయాన అక్కడి రాజకుమారులు సిగ్గుతో శిరములు వంచుకొన్నారు. అసన్నివేశాన్ని నవ్యమైన మృదుమధుర పదజాలంతో కవి తీర్చిదిద్దారు.

"చెల్లరే విల్లువిరుచునే నల్లవాడు
పదిపదారేండ్ల యెలరాచపడుచువాడు
సిగ్గు సిగ్గంచు లేచి గర్జించినారు
కనులు గుటిన తెలమొగాలవారు"

నల్లవాడనేపదం భారతజాతీయానికి, తెల్లమొగాలవారనేపదం ఆంగ్లేయులకు సంకేతంగా ప్రయోగించడం ఒక వింతసృష్టి.

శ్రీ తుమ్మల సీతారామమూర్తి 'పఱిగపంట' అనే ఖండకావ్యాన్ని 1943లో రచించారు. ఈ కృతిలో అపూర్వ కవితావైభవంతో జాతీయాభిమానం నిర్వహించబడింది. వీరి 'ధర్మజ్యోతి' ధర్మవీరరసమునకు 'ఆత్మార్పణము' దయావీర రసమునకు నిదర్శనాలుగా నిలిచాయి.

మధురకవి శ్రీనాళం కృష్ణారావు దాశరథి, ఏటుకూరి వేంకట నరసయ్య, వానమామలై వరదాచార్యులు, జాస్తివేంకట నరసయ్య, ధూళిపాళ వేంకట సుబ్రహ్మణ్యం మున్నగు కవులు దేశభక్తి కవితలు రచించి చీకటింట్లోకిరణాలు మెరిపించారు శ్రీదుర్భాకరాజశేఖర శతావధానిగారి రాణాప్రతాపసింహ చరిత్ర, శ్రీ గడియారం వేంకటశేషశాస్త్రి గారి శివభారతము స్వాతంత్ర్యోద్యమ సమయాన ప్రజల్లో క్రొత్త చైతన్యాన్ని నింపాయి.

లాగా, బసవరాజు అప్పారావుగారు గాంధీజీని కీర్తిస్తూ వ్రాసిన 'కొల్లాయి గట్టితేనేమి' అనేపాట గాంధీ మహాత్ముడు బయలుదేరగా కల కలనవ్వింది జగత్తూ కలకల నవ్వింది' అనే గేయం బహుళ ప్రజాదరణ పొందాయి. మాధవ పెద్ది బుచ్చి సుందరరామశాస్త్రి రచించిన 'అంటరానివారెవరో కాదు మా వెంటలానివారే' అనే గేయం, గరిమెళ్ళ 'మాకొద్దీ తెల్లదొరతనమూ' అనే గీతం జనుల హృదయాల్లో నర్తనమాడాయి.

ఆంధ్రకవులు జాతీయోద్యమంలో తమ కవితా శక్తిని వినియోగించారు. జాతీయభావం, దేశభక్తి కలిగించడమే వారి పరమలక్ష్యం. వారిలో కవిత గంగానదిలా పొంగింది. పటుతర భావనా శక్తితో దేశభక్తిని అందు రంగరింపజేశారు. ఉత్సాహజనకంగా గేయాలు రచించారు. స్వాతంత్ర్యోద్యమంలో ఆంధ్రుల్ని త్యాగమయులుగా తీర్చిదిద్దారు.

తెలుగు కవులు ఆనాడు నిర్వహించిన పాత్ర బహుముఖంగా శ్లాఘనీయమైంది.


**డా॥ షేక్ ముహమ్మద్ ముస్తఫా**
తెలుగు లెక్చరర్,
ప్రభుత్వ కళాశాల,
కదిరి, అనంతపురం జిల్లా


# చతుర్భాణీ పదబంధాలు

నైసర్గిక కవితా రామణీయతకు కాణాచి చతుర్భాణి శృంగార రసకోశము అన్నను ఒప్పే. వరరుచి వ్రాసిన ఉభయాభిసారికా ; ఈశ్వర

దత్తుని ధూర్తవిట సంవాదమ్ ; శూద్రక విరచిత పద్మ ప్రాభృతకమ్ ; మహాకవి సౌమిల్లకుని పాద తాడితకమ్—కవిపి తొట్టతొలిగ మహా మహోపాధ్యాయ శ్రీ మానవల్లి రామకృష్ణకవి గారు 1922లో ప్రకటించారు.

అతి ప్రాచీనమైన ఏకనట రూపకములు అగుటచేత ఇందలి భాష నేటి వారికి అంతగ తేట తెల్లము కామిచే, ఈ చతుర్భాణీ విశిష్టత మరుగున పడినది. అంతేగాక వాత్స్యాయన కామ సూత్రములు, భరత ముని నాట్యశాస్త్రము తెలిసిన గాని, ఈ చతుర భాణములలోని భావములు సనిగ ఆవిష్కరింపబడవు. చారిత్రకముగ మిక్కిలి ప్రాధాన్యత సంతరించు కొనిన విలువైన రచన చతుర్భాణీ.

సేవావాదం = ముఖస్తుతి.

శ్లో : కిమయం సేవావాద...హన్త ప్రాప్తం సేవావాదఫలం రామసేనేన—అని వరరుచి వర్ణన.

'కార్కశ్యయోగ్యారణి:' = వర్ధాణము, మేఖల

ఏషా కామికరాంగులి ప్రియ సఖీ
    నాభి ప్రహదామ్బ స్రుతిః
విద్యుత్ క్షౌమ బలాహకస్య రుచిరా
    కార్కశ్య యోగ్యారణి-

అని ఈశ్వరదత్తుని వర్ణనోత్ప్రేక్ష.

స్తబ్ధా = అభిమానవతి

బాలా బాలత్వాత్ ద్రవ్యలుబ్ధా ప్రదానైః
...స్తబ్ధా సేవాభిర్దక్షిణా దక్షిణత్వాత్—

అని ధూర్తవిట సంవాద కర్త. నాట్య శాస్త్రమ్ 25–33, 88, 3 శ్లోకాలు.

పద్మప్రాభృతకం మంగళాచరణ పద్యం లోని కాన్త తరవపు' శబ్దమును నాట్యశాస్త్రంలోని 'అల్పతర ప్రపిచార' (7–12) పదముతో పోల్చినది. 'కాన్త' శబ్దానికి విష్ణు సహస్రనామముల పైని భాష్యం వ్రాస్తూ శ్రీ శంకరాచార్యులు అభిరూప తమ కాన్త' అని ఒకచోట, అభిరూప తమం దేహం వహక్కాన్త అని వేరొక చోట వ్రాసినారు. సౌమిల్లకుడు కూడ 'శ్వలిత తరవపు'ః అని ప్రయోగించినాడు.

దేవానాం ప్రియ = భాగ్యశాలి

అశోక శాసనాల ద్వారా ప్రపంచానికి సుపరిచితమైన ఈ పదము పద్మప్రాభృతకంలోను, పాదతాడితకంలోను ఉపయోగించబడింది.

'స్వోపగ్రహమ్' = మిక్కిలి విశ్వాసపాత్రుడు.

ఈ పదము బాణభట్టుని కాదమ్బరిలో (పీటర్సన్ ముద్రణ 156, 220 పుటలు)కలదు

'సాధు భోః అమృదంగో ఆవీణో నాటకాంక సంవృత్తః' అనే పదబంధాన్ని మృచ్ఛకటికా కర్తకూడ ఉపయోగించుకొన్నాడు. కాని ముద్రిత ప్రతులలోని పాఠము సుష్ఠువు కాదు. పద్మప్రాభృతక పాఠమునుబట్టి మృచ్ఛకటికలోని పాఠమును సరిచేయవలె.

'మనసిజకదనం' = రతికేళి

కామకేళీ రహస్యకర్త కొక్కోకుడు మదన యుద్ధం (10–52) అనినాడు. కుట్టనీమత రచయిత 'అబద్ధసురత సంగర విమర్ద సంక్షోభిత దయితా' (573) అని వ్యాఖ్యానించినాడు. 'చౌర సురత పంచాశికా' కర్త సురతకేళి యుద్ధమ్ (48) అని చెప్పినాడు.

ఆ శరీరవాక్ కాను ఇవా ధనుర్ధర :

మహాకవి భాసుడు స్వప్న వాసవదత్తా రూప కంలో (తృతీయాంకం—48 పంక్తి) సక్కం భజిదుం సర చావహీణో కామదేవోత్తి 'అనినాడు. మన్దసార కాననం (473సం॥)లో బంధువర్మ రాజు వర్ణనం చేస్తూ వత్సభట్టి''రూపేణ యః

కుసుమచాప ఇవ ద్వితీయః'' అనినాడు. అశ్వ ఘోషుడు లభించిన శారద్వతీ పుత్రకవు తునక లలో' సపురుష విగ్రహోధర్మఃఅన్నాడు.

చర్షిణి = అననుకూలభార్య, గయ్యాళిగింప

ఈ పదాన్ని సౌమిల్లకుడు వాడినాడు. మిక్కిలి అపురూప పదం. కామ సూత్రములు (6—5—5)లో కలదు' రాజ తరంగిణి (7—102) లో ఉన్నది. ఇతరత్ర కానరాదు.

తథానామ=ఔనౌను, నిజము.

ఈ పదము, ఈ అర్థంలో ఏ రూపకంలోను ఏ కావ్యంలోను ప్రయోగింపబడలేదు. అపురూప విలక్షణ ప్రయోగము సౌమిల్లకుని అత్యంత ప్రాచీనతకు నిదర్శనమా?

'విపరీతం'—పురుషాయిత సురత కేళి

ధ్రువం రామారామం యువతి విపరీతం రమ యతి—అని సౌమిల్లకుని మనోహర ప్రయోగం. నిర్మర్యాదమైన సంస్కృత సాహిత్యంలో మగ పోడిమి వర్ణనలు కుప్పతెప్పలు. భారవి —మా-ఘ— శ్రీహర్ష కృతులందు సొగసుగ వివరించ బడింది.

కాష్ఠ కంహం = పనికి మాలికపోరు, తమాషా పోట్లాట 'బాల్యేఽపి కాష్ఠ కలహాత్ కథయన్తి యేషాం వృద్ధా, సయోధన వృకోదరయో రివోచ్చైః —అని సౌమిలకుని.

ప్రయోగ సరళి శూద్రకుడు, కాళిదాసు మున్నగువారు సౌమిల్లకుని రచనలు బహు వారములు చదివినట్లు వారి రచనలే సాక్ష్యం. మృచ్ఛకటికంలో ప్రాకృత భాషావేషంలోని

పదబంధం చూడండి—'కట్టకలహం ప్పి అంకలేమి'' కర్ణాట కలహం అని ముద్రించుట అవిచారమూలకము (నేను మృచ్ఛకటిక మును సరిగ పరిష్కరించి ఉన్నాను).

ఇప్పగుంట సాయిబాబా
హరిబౌలి
హైదరాబాద్ 500 265.

# తిక్కన– కుమారవ్యాసుల గదాయుద్ధం

ప్రపంచ సాహిత్యంలోని ఐతిహాసికకావ్యాల్లో మహాభారతం ఆ ప్రతిమమైంది మహాభారతాన్ని మొదట 'జయము' అని పిలిచేవారు. పాండవుల విజయగాథ దీనిలో చెప్పబడడంచేత మహాభార తానికి జయమని నామకరణం చేయబడిందేమో!. భరత వంశీయులైన కౌరవ పాండవుల కథ దీనిలో చెప్పబడటం చేత దీనికి భారతం అనేపేరు కలిగింది. ధర్మోపదేశాలు మొదలైనవి చేర్చబడి భారతం విశాల కాయాన్ని సంతరించుకొంది. అపుడు దీనికి మహాభారతమనే పేరు ఏర్పడింది.

మహాభారతంలో సమస్త వేదోపనిషత్తుల జ్ఞానరహస్యాల్ని, ఇతిహాస పురాణాల్ని మథించి వాటి సారాన్ని ఇందులో పొందుపర్చి, వేదవ్యాస మహర్షి మానవాళికి అమూల్యకానుకగా ప్రకటించారు.

కవిబ్రహ్మ తిక్కన సోమయాజి ఉదాత్త మనీషి, శిల్ప పారగుడు, కళావిదుడు. అతని రచన నాటకీయమైందనీ, రసౌచిత్య బంధం, అర్థగౌరవం కలిగిందని కవులు అంగీకరించారు. పండితులు ప్రశంసించారు.

కుమారవ్యాసుడు కన్నడ భాషలో సుప్రసిద్ధ మహాకవి. వైష్ణవ భక్తుడైన కుమారవ్యాసుడు 15వ శతాబ్దికి చెందినవాడు. కరణాల కుటుంబానికి చెందిన స్మార్త బ్రాహ్మణుడు. ఈ కవి అసలు పేరు నారాయణప్ప అయినప్పటికీ వ్యాసుని గురువుగా భావించి కృతి రచనకు పూనుకొన్నాడు కాబట్టి కవి తననే కుమారవ్యాసునిగా ప్రకటించుకొన్నాడు. భారతాన్ని కుమారవ్యాసుడు, తిమ్మణ్ణ కలసి కన్నడ భాషలో పూర్తిచేశారు.

కుమారవ్యాసుడు ఆదిపర్వం నుండి సౌప్తిక పర్వం వరకూ వ్రాశాడు. ఈ పది పర్వాల్ని కన్నడంలో దశమ సంధులు అంటారు 'భామినీ షట్పది' ఛందస్సునెన్నుకొని కావ్యరచన సాగించారు.

## శల్య పర్వ ప్రాశస్త్యం :

ఇది 18 పర్వాలు కలిగిన మహాభారతంలో 9వ పర్వం. ఈ పర్వంలోని విషయాలకు ఎంతో ప్రాముఖ్యం వుంది రారాజైన దుర్యోధనుని ప్రాణ మిత్రుడు కర్ణుడు అంతరించిన తరువాత శల్యుడు సేనాధిపతి కావడం, తరువాత అతడూ మరణించడం, ఉద్దండ మహోద్దండబల శాలురైన భీమ దుర్యోధనుల గదా యుద్ధం అతి రమణీయంగా, చాలా భయంకరంగా ఇందులో వర్ణింపబడ్డాయి.

మహాభారత గ్రంథపఠిత హృదయానికి ఎవరిది గెలుపనే సందేహానికి చక్కని సమాధానం ఈ పర్వంలో లభ్యమౌతుంది.

పాండవులు ఐదుగురిలో ఏ ఒక్కరితో నీవు యుద్ధంచేసి గెలిచినా యావత్ సామ్రాజ్యంవని దుర్యోధనుడితో ధర్మరాజు అంటాడు. దీన్నిబట్టి ధర్మజుని ధార్మికత వెల్లడికాగా, తనతో పోరాటానికి భీముణ్ణే ఎన్నుకోవడం దుర్యోధనుని పౌరుషానికి పరాకాష్ట అయింది.

గదా యుద్ధంలో నాభికింద కొట్టడం అధర్మం. తన ప్రియ శిష్యుడగు దుర్యోధనుడు తొడలు విరిగి నేల కొరగడం చూచి బలరాముడు కోపావేశంతో భీమునిపైకి ఉరుకుతాడు. ఇక్కడ బలరాముని న్యాయకుశలత కనబడుతుంది.

శత్రువునుండి కాపాడుకోవడం కోసం యుద్ధ ధర్మాన్ని విడిచి అధర్మంగానైనా ఎదుట వ్యక్తిని దెబ్బతీయవచ్చనే క్రొత్త న్యాయాన్ని శ్రీకృష్ణుని చేత ఈ ఘట్టంలో ప్రతిపాదింపజేయడం జరిగింది. ముద్దుల కొడుకు తొడలు విరిగి యుద్ధభూమిలో పడిపోయాడని విని ధృతరాష్ట్రుడు బోరున ఏడ్వడం హృదయ విదారకమైంది.

ఏ సామ్రాజ్యం కోసం కౌరవులతో పాండవులు పోరాటం చేశారో ఆ పోరాటానికి విజయ పతాక కొద్ది క్షణాల్లో ఎగిరేందుకు సిద్ధమయ్యే సన్నివేశాలు, దుర్యోధనుడు హంస తూలికా శయనాన్ని విడిచి కటికనేలపై ఘోరాతి ఘోరంగా పడిపోవడాన్ని చిత్రించడమైంది.

మొదటి నుండీ దుర్యోధనుడు దుష్టుడని భావించేవారు సైతం, తొడలు విరిగి, నిస్సహాయుడై రణరంగంలో అతడు పడిపోయాడనే సరికి మనసు కరిగిపోతుంది. జాలి కలుగుతుంది.

దుర్యోధనుడనే అన్యాయ పూర్వక తమస్సు అంతరించి ధర్మజుడనే న్యాయజ్యోతి వెలగడం

ఈ పర్వ ప్రధాన ప్రాశస్త్యం. పద్దెనిమిది పర్వాలు గల్గిన మహాభారత ఇతిహాసంలో తొమ్మిదవ పర్వంలోనే మూల సారాంశాన్ని వ్యక్తపరచినట్లయింది.

## పోలికలు–తారతమ్యాలు :–

మడుగునుండి బయటకు వచ్చిన దుర్యోధనుడు ధర్మరాజునితో శమంతక పంచకం పుణ్యక్షేత్రం అక్కడ చనిపోయినవారు తప్పక స్వర్గానికి వెళతారని వినికిడి కాబట్టి అక్కడకువెళ్లి యుద్ధం చేద్దాం.' అంటాడు. 'యుద్ధంలో మరణించేవారు స్వర్గానికి వెళతారు' అని దుర్యోధనుడిచేత తిక్కన పలికించారు. దుర్యోధముని ఓటమిని సూచన ప్రాయంగా ముందుగానే తెలియజేసినట్లయింది. కుమారవ్యాసుడు అట్లు చూపలేదు.

గదా యుద్ధ ప్రారంభంలో దుర్యోధనుడు ప్రేక్షకుల్ని ఉద్దేశించి 'మీరంతా కూర్చొండి' అని చెప్పినట్లుగా కుమారవ్యాసుడి భారతంలో చెప్పడమైంది. కాని తిక్కన భారతంలో ప్రేక్షకులందరిని కూర్చుండ బెట్టమని' దుర్యోధనుడు ధర్మరాజుతో చెప్పినట్లుంది. ప్రేక్షకులతో నేరుగా దుర్యోధనుడు, చెప్పడం కంటే ధర్మరాజు చెప్పినట్లయితే సమజంసంగా వుంటుందనే తిక్కన భావం సరియైంది

యుద్ధానికి ముందు భీమ దుర్యోధనులు ఒకరినొకరు దూషించుకోవడం చాల సుదీర్ఘంగా కుమారవ్యాసుడు వర్ణించాడు. ఆ నిందించుకోవడం గూడా వారి స్థాయికి తగ్గట్టుగా లేక పోవడం దురదృష్టకరం. కాని తెలుగు భారతంలో తిక్కన వారి సంభాషణల్ని ఎంతవరకు అవసరమో అంతవరకే చూపించాడు.

భీమునితో అనేకమైన పరుషవాక్యాల్ని పలికిన దుర్యోధనుడు నీకు తోడుగా యుద్ధానికి కృష్ణార్జునుల్ని కూడా పిలుచుకోమన్నట్లుగా కుమారవ్యాసుడు తెలియజేశాడు. తిక్కన అట్టి అధిక ప్రసంగాల్ని విడిచిపెట్టారు.

రక్తంతో తడిసిన ఇరువురి గదలూ, రెండు సూర్యబింబాల్లా ప్రకాశించాయని తిక్కన చేసిన వర్ణన రమణీయమైంది. కుమారవ్యాసుడు అట్టి వర్ణనలు సందర్భానికి తగినట్లుగా చేయలేదు.

కుమారవ్యాసుడు గదాయుద్ధంలో మధ్యమధ్య భీమ దుర్యోధనులిద్దరికీ విశ్రాంతి కల్పించాడు. అలసిపోయి పడిపోయినపుడెల్ల తాంబూలాలు నమిలి వారు విశ్రాంతి తీసికొన్నట్లుగా చెప్పడమైంది. ఇది చాల హేళనగా పాఠకులికి అన్పిస్తుంది. తిక్కనకు తెలిసినంతగా యుద్ధమర్యాదలు కుమారవ్యాసుడికి తెలిసినట్లులేదు.

తిక్కన కుమారవ్యాసుల గదాయుద్ధాల్లో కథాకథనంలో అంతగా భేదం కన్పించదు. కాని ఔచిత్యానౌచిత్యం పరిశీలిస్తే కుమారవ్యాసుడి గదా యుద్ధం కంటె తిక్కన గదాయుద్ధ చాల ఔచిత్యవంతంగా కన్పిస్తుంది. యుద్ధవర్ణనలో తిక్కన కళాగత పాత్రలు మనముందు ప్రతిబింబిస్తాయి. అంత సుదీర్ఘమైన యుద్ధవర్ణనలో పఠితకు ఎక్కడ కూడ విసుగురాదు సరిగదా! ఉత్సాహం ఉరకలు వేస్తుంది. తరువాత ఏం జరుగుతుందనే ఆత్రుతను కలిగిస్తుంది.

కుమారవ్యాసుడి భారతంలో అవసరం లేని చోట అధికమైన సంభాషణలు పాత్రలనోట పలికించడం ద్వారా అనౌచిత్యం వ్యక్తమౌతుంది. ఒక విధంగా పాఠకుడికి విసుగుపుట్టే అవకాశం కలుగుతుంది.

తిక్కన రచన రసాభ్యుచిత బంధం.
కుమారవ్యాసుని రచన భక్తిరస తుందిలం
తిక్కన రసకవి కుమారవ్యాసుడు భక్తకవి
ఇరువురూ మహాకవులే.

ఖండాపు మన్మథరావు
తూడి పోష్టు వీరఘట్టాం జి॥ శ్రీకాకుళం 532 460

# వార్తావాహిని

## గుంటూరు జిల్లా అమృతోత్సవ హిందీ మహాసభలు

### తెనాలి

దక్షిణ భారత హిందీ ప్రచార సభ, మద్రాసు వారి గుంటూరు జిల్లా అమృతోత్సవ హిందీ మహా సభలు ది. 18–12–1994 న తెనాలి హిందీ ప్రేమీ మండలి మహా విద్యాలయ ప్రాంగణంలో వైభవంగా జరిగినవి. ఉదయం గం. 9–00లకు హిందీ ప్రేమీమండలి అధ్యక్షులు డా. పాటిబండ్ల దక్షిణామూర్తి జాతీయ పతాక వందనము గావించారు.

శ్రీ అన్నదానం రామస్వామి, ప్రధాన కార్యదర్శి దక్షిణ భారత హిందీ ప్రచార సభ, మద్రాసు అధ్యక్షతన హిందీ ప్రచారక సమ్మేళనం జరిగినది. శ్రీ వి. రామమోహనరావు మునిసిపల్ కమీషనర్ తెనాలి జ్యోతి ప్రజ్వలన కావించారు. హిందీ ప్రచార సమ్మేళనం, అమృతోత్సవ సభలు తెనాలిలో జరగడం చాలా సంతోషమని ఆయన అన్నారు.

సభాధ్యక్షులు శ్రీ రామస్వామి గారు ప్రసంగిస్తూ ఇది రాష్ట్రస్థాయి సమ్మేళనంలా వుంది. ఈ సభలు తెనాలిలో జరగడం గర్వకారణం దక్షిణ భారత హిందీ ప్రచార సభను స్థాపించి 75 సంవత్సరములు అయిన సందర్భమున ఢిల్లీలో ప్రధాన మంత్రి గా శ్రీ పి వి. నరసింహారావు తమ నివాసంలో ఈ అమృతోత్సవమునకు ప్రారంభోత్సం గావించుట జరిగిందంటూ తెలిపారు.

శ్రీ కాజ వెంకటేశ్వరరావు కేంద్ర సభ కార్యాధ్యక్షులు తమ ఉపన్యాసంలో అమృతోత్సవ సభలు మన ఇంట్లో వేడుకలాంటివని, ఈ సందర్భంలో ప్రచారకు లందరూ ఆత్మావలోకనం చేసుకొని ప్రచార క్షేత్రంలో ముందంజ వేయాలని అన్నారు. మహాత్ముని ఆశీర్వాదబలం దేశప్రజల ఆదరాభిమానాలు హిందీ ప్రచారానికి పెట్టని కోటలని అభిప్రాయపడ్డారు. హిందీ ప్రచారకుల నుద్దేశించి మాట్లాడుతూ ప్రతి ఒక్కరూ హిందీని నేర్చుకొని భారతీయుడని గర్వించేలా హిందీ ప్రచారం గావించాలని ఉద్బోధించారు.

శ్రీ చిరావూరి సుబ్రహ్మణ్యంగారు హిందీ–తెలుగు సాహితీ ఆదాన ప్రదానము అన్నవిషయము పై ప్రసంగిస్తూ తన జాతికి తనదొక భాషంటూ ఉందనీ, హిందీ–తెలుగు భాషలకు శతాబ్దాల

చరిత్రతో పాటు సమృద్ధమైన సాహిత్యం కూడా కలదని అన్నారు. కేంద్రసభ మద్రాసు ద్వారా 60 వేల శబ్దాంతో త్రిభాషా కోశం ప్రచురింప బడుతున్నందుకు హర్షం ప్రకటించారు.

ఆంధ్ర సభ ఉపాధ్యక్షురాలు శ్రీమతి ఎం. వేదవల్లి హిందీ ప్రచారం—మహిళల పాత్ర అన్న అంశంపై మాట్లాడుతూ, నేడు ప్రతి రంగాల్లో స్త్రీలు ముందంజ వేస్తున్నారని, హిందీప్రచారంలో కూడా స్త్రీలు తమ వంతు పాత్ర నిర్వహిస్తున్నారని అన్నారు.

శ్రీ ఈమని దయానంద, సంపాదకులు, స్రవంతి పత్రిక, హిందీ తెలుగు కవితల తులనాత్మక పరిశీలన గావిస్తూ సోదాహరణంగా ప్రసంగించారు. కవి హృదయాన్ని గమనించి అనువదించాలని మౌలిక రచయితకు అన్యాయం చేయకుండా అనువాదం జరగాలని అన్నారు.

ఆంధ్ర సభ కోశాధ్యక్షులు శ్రీ చవాకుల నరసింహమూర్తిగారు సామాజిక సంస్కృతి-హిందీ మాధ్యమం గురించి ప్రసంగిస్తూ, గాంధీజీ అడుగు పెట్టిన ఈ పుణ్యభూమిలో అమృతోత్సవాలు జరగడం మహాభాగ్యమని సభ్యత బాహ్యమైనది కాగా, సంస్కృతి అభ్యంతరమైనదని నుడివారు. హిందీ సాహిత్యంలో మన సంస్కృతిని ప్రోదు చేయాలని, రాజ్యాంగంలో పేర్కొనబడిన రాజ భాష హిందీ దక్షిణ ఉత్తర భారతాలను ఏకం చేయగల ఏకైక భాష అని అన్నారు.

ఆంధ్రసభ కార్యవర్గ సభ్యులు శ్రీ కడారు మల్లయ్య నేటి హిందీ ప్రచార సమస్యలు గురించి మాట్లాడుతూ — జాతి సమైక్యతకు సాధనమైన హిందీ దేశ సమగ్రతకు పరిరక్షణకు ఉపకరించుట ఎల్లరకు తెలిసిన సంగతేనని: అందుకు హిందీయేతర ప్రాంతాల రచయితల సహకారం విస్మరింప రానిదని అన్నారు ప్రభుత్వకార్యాలయాల్లో హిందీకి స్థానం లభించేదిశగా కృషి జరగాలన్నారు.

శ్రీ గోదా తిరుమలయ్య, ఆంధ్రసభ కార్యవర్గ సభ్యులు ఆంధ్రలో హిందీ ప్రచారం గురించి ప్రసంగిస్తూ—ఆంధ్రకాభవ దేశభక్త కొండా వెంకటప్పయ్య, ఆంధ్ర కేసరి టంగుటూరి ప్రకాశం పంతులు, డా॥ బెజవాడ గోపాలరెడ్డి, శ్రీ రామానంద తీర్థ వంటి ప్రముఖులు అధ్యక్షులుగా ఉండడం సభ అదృష్టమని, ఎందరెందరో మహనీయులు సభ అభివృద్ధికి తోడ్పడం అభినందనీయమన్నారు.

గ్రామ స్థాయి ప్రచారకులు హిందీ ప్రచారం చేయడం ద్వారా, లక్షలాది మంది హిందీ భాషా జ్ఞానంతో పాటు జాతీయతా భావం పెంపొందించుకొన్నందుకు ఆనందం వెల్లడిదారు.

ఆంధ్రసభ కార్యదర్శి శ్రీ అన్నదానం శంకరశాస్త్రి ఆంధ్రసభ హిందీ ప్రచారం గురించి మాట్లాడుతూ—రాష్ట్రంలోని అన్ని జిల్లాలో జరుగుచున్న హిందీ ప్రచార ప్రగతిని వివరిస్తూ, ప్రచారకులను అభినందించారు. ఈ అమృతోత్సవ స్ఫూర్తితో హిందీ ప్రచారకులు హిందీ భాషా ప్రచారం ఇతోధికం గావించాలని కోరారు.

ఆంధ్రసభ కార్యవర్గ సభ్యులు శ్రీ పి. మహేశ్వరరావు అమృతోత్సవ ప్రాధాన్యతను విశదీకరిస్తూ పూజ్య గాంధీజీ స్థాపించిన కేంద్రసభ, దక్షిణాది రాష్ట్రాలలో శాఖా కార్యాలయాల ద్వారా విస్తరిల్లి, రజత. స్వర్ణజయంతి వంటి ఉత్సవాలను దాటి నేడు అమృతోత్సవం జరుపుకొనడం ఈ

తరం వారికి ఎంతో సంతోషం కలిగిస్తున్న దన్నారు.

రాష్ట్ర సర్వోదయ మండలి అధ్యక్షులు శ్రీ బి. వి. రామారావు హిందీ ప్రచారం–వినోబాజీ పాత్ర అను విషయంపై ప్రసంగిస్తూ–శ్రీ వినోబాజీ ఉత్తర ప్రత్యుత్తరాలు, చర్చలు, గోష్ఠులు, సమావేశాలు హిందీలోనే నిర్వహించి, ఆదర్శ ప్రాయులైనారని అన్నారు.

శ్రీ బి. అంజయ్య రాష్ట్ర హిందీ ప్రచారక మండలి ప్రధాన కార్యదర్శి, హిందీ ప్రచారక మండలి కార్యక్రమాలు అను అంశంపై మాట్లాడుతూ ప్రచారక మండలి చరిత్రను విశదీకరించి ఇప్పుడు 23 జిల్లాలలో విస్తృతంగా తన కార్యకలాపాలను సాగిస్తున్నదని అన్నారు.

శ్రీ ఎమ్. శేషాద్రి ఆంధ్రసభ కార్యవర్గ సభ్యులు, హిందీ భాష అవసరాన్ని సోదాహరణంగా చెప్పారు

సభ నిర్వాహకులు డా॥ కె. హనుమంతరావు ధన్యవాదములు తెలిపారు.

## అమృతోత్సవ హిందీ మహాసభ

సాయంత్రం గం. 3–00లకు అమృతోత్సవ హిందీ మహాసభ ప్రారంభమైంది. డా॥ బెజవాడ గోపాలరెడ్డి మాజీ గవర్నర్ ద.భా. హిందీ ప్రచారసభ ఆంధ్ర మాజీ అధ్యక్షులు అధ్యక్షత వహించారు. కళాప్రపూర్ణ డా॥ సంజీవదేవ్ ముఖ్య అతిథిగా వేదికనలంకరించారు. ఆహ్వాన సంఘాధ్యక్షులు డా॥ కొడాలి వరప్రసాద్ స్వాగతం చెప్పారు.

ఈ సందర్భంగా ప్రముఖ సాహితీవేత్త డా॥ సంజీవదేవ్ జిల్లా హిందీ ప్రచారకమండలి ప్రచురించిన 'హిందీ ప్రచార ప్రదీపిక'ను ఆవిష్కరించారు. ఈ ప్రదీపిక గుంటూరు జిల్లాలోని హిందీ ప్రచారానికి దర్పణం వంటిదని ఈ అమృతోత్సవ శుభవేళ దీనిని వెలువరించడం సమంజసమని అభినందించారు.

శ్రీ అన్నదానం రామస్వామి అమృతోత్సవ నివేదికను సమర్పించారు. ఈ సంవత్సరం ఇంటింటా హిందీని అందించే లక్ష్యంతో ఈ మౌలిక పరీక్ష పెట్టి లాభాపేక్ష లేని కార్యక్రమం చేబట్టామని అన్నారు లక్షల సంఖ్యలో అమృత హిందీ పరీక్షలకు తర్ఫీదు ఇచ్చిన హిందీ ప్రచారకులను అభినందించారు.

ఆంధ్ర విశ్వవిద్యాలయం హిందీ ప్రొఫెసర్ శ్రీ పి. ఆదేశ్వర రావు ప్రసంగిస్తూ ఎన్నో వడిదుడుకులు ఎదుర్కొంటూ మహాత్ముని ఆశీర్వాద బలంతో హిందీ ప్రచారం జరగడం పట్ల సంతోషం వెల్లడించారు.

ఆంధ్రసభ అధ్యక్షులు శ్రీ బోడపాటి నాగేశ్వరరావు తమ ఉపన్యాసంలో మద్రాసులో ప్రారంభమైన హిందీ ప్రచారం క్రమంగా నాలుగు రాష్ట్రాలలోను పట్టణాలలోనే గాక మారుమూల గ్రామాల వరకు విస్తరించిందని, ఇందుకు మహాత్మా గాంధీ, రాజేంద్ర ప్రసాద్ మొదలుకొని జాతీయ నాయకులందరు హిందీ ప్రచారానికి సహకరించారని, స్వాతంత్ర్య సమరంలో ఖద్దరుతోపాటు హిందీభాషకు ప్రాధాన్యత లభించిందని, అది జాతీయ సమైక్యతకు తోడ్పడినదని అన్నారు. అమృతోత్సవంద్వారా హిందీ

ప్రచార చైతన్యాన్ని తీసుకు రావాలని ఉద్బోధ గావించారు.

శ్రీ చక్కా రామకృష్ణారావు, ఉపాధ్యక్షులు, పట్టణ హిందీ ప్రేమీమండలి, గుంటూరు, మాట్లాడుతూ జాతీయ భాషను పిల్లలకు నేర్పించడం తల్లిదండ్రుల కర్తవ్యమని, తద్వారా భావి పౌరులైన విద్యార్థుల్లో విశాలభావాలను పెంపొందించాలని అన్నారు.

శ్రీ వేము భావనారాయణ, ఉపాధ్యక్షులు, పట్టణ హిందీ ప్రేమీమండలి, గుంటూరు, హిందీ భాషావశ్యకతను స్వానుభవంతో వివరించి, దాని వల్ల కలిగే ప్రయోజనాలను విశదపరిచారు.

ఉపన్యాసం చేస్తూ డా॥ బెజవాడ గోపాలరెడ్డి హిందీ నేర్చుకోవాలన్న భావన ప్రజలలో మొదటిసారిగా కలిగించిన మహాత్మా గాంధీ చిరస్మరణీయుడని స్వాతంత్ర్యోద్యమంతో ఖద్దరు, అంటరానితనం నిర్మూలనతోపాటు హిందీ భాషాప్రచారం కూడా జరిగిందని పేర్కొన్నారు. నేడు అంకితభావంతో హిందీ ప్రచారం జరుగుచున్నదని, ఇందుకు తమ జీవితాన్ని అంకితం చేసిన పద్మభూషణ్ శ్రీ మోటూరి సత్యనారాయణ వంటి పెద్దలు అభినందనీయులని ఉద్ఘాటించారు. అదేవిధంగా శ్రీ బోయపాటి నాగేశ్వరరావు హిందీ ప్రచారాన్ని ధ్యేయంగా పెట్టుకొని విశేష కృషి జరిపారని అభినందించారు, దేశ సమైక్యత సమగ్రతల సాధనలో హిందీ భాషకు ఎనలేని ప్రాముఖ్యం ఉందని, వివిధమతాల మధ్య సఖ్యతకు ఈ భాష దోహదపడుతుందని శ్రీ గోపాలరెడ్డి అన్నారు.

ఆహ్వానసంఘాధ్యక్షులు డా॥ కె. వరప్రసాదు డా॥ బెజవాడ గోపాలరెడ్డి, డా॥ సంజీవదేవ్‌గార్లను పుష్పమాలాలంకృతులను చేసి, అమృతోత్సవ దుశ్శాలువలతో సన్మానించారు.

డా॥ బెజవాడ గోపాలరెడ్డి అమృతహిందీ ప్రచారకులను సన్మానించగా, శ్రీ చొక్కా రామకృష్ణారావు, శ్రీ వేము భావనారాయణ, శ్రీ బోయపాటి నాగేశ్వరరావు హిందీప్రచారకులకు విశిష్ట సన్మానం గావించారు.

సహాయకార్యదర్శి శ్రీ సి. హెచ్. కుసుమ జగన్నాథశర్మ ధన్యవాద సమర్పణచేశారు.

## హిందీ ప్రచారక ప్రశిక్షణ మహావిద్యాలయం తెనాలి

తెనాలి హిందీ ప్రచారక ప్రశిక్షణ మహావిద్యాలయ వార్షికోత్సవం ది. 17–12–94 సాయంత్రం గం॥ 4–00 లకు శ్రీ కాజ వెంకటేశ్వరరావు, కార్యాధ్యక్షులు, ద. భా. హిందీ ప్రచార సభ, మద్రాసు అధ్యక్షతన జరిగింది. కులపతి, శ్రీ బోయపాటి నాగేశ్వరరావు స్వాగత వచనములు పలికి, ముఖ్య అతిథి ఉపన్యాసకులను పరిచయం చేశారు. 1934లో శ్రీ మోటూరి సత్యనారాయణగారు ప్రచారక విద్యాలయాన్ని ప్రారంభించారు అన్నారు.

ప్రిన్సిపాల్ డా॥ కె.హనుమంతరావు గారు శ్రీ బోయపాటి దంపతుల సేవా నిరతిని, సహాయ సహకారములను ప్రస్తుతించి, వారికి అభివందనలు తెలిపారు.

ముఖ్య అతిథి శ్రీ అన్నదానం రామస్వామి, ప్రధాన కార్యదర్శి, ద. భా. హిందీ ప్రచార సభ,

మద్రాసు మాట్లాడుతూ ప్రప్రథమముగా 1922 లో హిందీ ప్రచారక ప్రశిక్షణ ప్రారంభమైనదని, అభ్యర్థుల కోరిక మేరకు అదే పేరుతో నేటి కిని ప్రశిక్షణ కొనసాగుచున్నదని, హిందీ ప్రచార కులను తయారు చేయడం నాటి లక్ష్యమని అన్నారు. శ్రీ బోయపాటి దంపతుల ప్రేరణతో ఏర్పడిన ఇచ్చటి హిందీ వాతావరణం ప్రశంస నీయమని పేర్కొని, గతంలో వలె మంచి ఫలితం పొందగలరని ఆశిస్తూ తమ శుభాకాంక్షలంద జేశారు ఆంధ్రసభ కార్యదర్శి శ్రీ ఎ. శంకర శాస్త్రి ఉపాధ్యాయ వృత్తి ఉత్తమమైనదని, కుల పతి బోయపాటి దంపతుల పర్యవేక్షణలో ప్రశిక్షణ పొందుట అదృష్టంగా భావించాలని అన్నారు మాతృసంస్థ పేరు ప్రఖ్యాతులు ఇనుమ డింప జేయాలంటూ ప్రశిక్షణార్థులకు ఆశీస్సులంద జేశారు.

కుమారి దయానంద, స్రవంతి సంపాదకులు ప్రశిక్షణార్థుల నుద్దేశించి ప్రసంగిస్తూ, జీవితంలో ధైర్యంగా ముందుకు సాగాలని, సౌశీల్యం సౌజన్యం అలవరచుకోవాలని అన్నారు

కేంద్రసభ శిక్షా పరిషత్ సభ్యులు సిహెచ్. కుసుమ హరినాథశర్మ హిందీ ప్రచార రంగంలో యువతీ యువకులు ప్రవేశించి నూతనోత్సాహంతో భాషా ప్రచారం గావించాలని కోరారు.

శ్రీ కాజ వెంకటేశ్వరరావు తమ అధ్యక్షోప న్యాసంలో పూజ్యబాపూజీ అడుగు పెట్టిన ఈ ప్రదేశం అతి పవిత్రమైనదని, గురుకుల వాతావరణంలో ప్రశిక్షణ పొంది 'నిరాడంబరత–ఉన్నత ఆశ యాలు' జీవిత పాఠంగా నేర్పిన విద్యార్థులను అభి నందించారు నిజ జీవితంలో ఉత్తమ ఆశయ సాధనకు నిర్భయంగా ముందడుగు వేయాలని కాంక్షిస్తూ, ప్రశిక్షణార్థులకు శుభాశీస్సులందజేశారు

శ్రీ బోయపాటి నాగేశ్వరరావు ప్రచారక విద్యాలయం తరపున శ్రీ అన్నదానం రామస్వామిని నూతన వస్త్రాలతో సత్కరించారు ప్రచారక విద్యాలయ ప్రశిక్షణార్థులు, శ్రీమతి ఎ.వి పద్మను, విద్యాకార్యదర్శి. కేంద్ర సభ నూతన వస్త్రములు ఫలపుష్ప తాంబూలాదులతో సన్మానించారు

ప్రచారక విద్యాలయ విద్యార్థి బృందం ఉపాధ్యాయ వర్గం తరపున శ్రీ పి. సిహెచ్ పి శివకుమార్, శ్రీ ఎన్. సత్యనారాయణ భార్యలు ధన్యవాదములు తెలిపారు.

సభానంతరం డా॥ కె. హనుమంతరావు రచన 'భక్తమీరా' తెలుగు నాటిక జనరంజకంగా ప్రదర్శించబడినది.

## హిందీ ప్రచారక్ ప్రశిక్షణ మహావిద్యాలయం, హైదరాబాదు–4

ది. 15–12–1994 తేదిన హిందీ ప్రచారక ప్రశిక్షణ్ మహా విద్యాలయం, సత్రాంతి సమారోహ మహా విద్యాలయ భవనంలో ప్రొఫెసర్ దిలీప్ సింహ్‌గారి అధ్యక్షతన జరిగినది. మహా విద్యాలయి ప్రిన్సిపాల్ డా. ఎమ్. బి. వి. ఐ ఆర్ శర్మ గారు తమ వార్షిక నివేదికను చదివి వినిపించిరి కొందరు ఛాత్రాధ్యాపక, అధ్యాపికలు తమ తమ అనుభవములను వినిపించిరి. డా. భీమ్‌సేన్ నిర్మల్‌గారు దీక్షాంతోపన్యాసము నిచ్చిరి. మహా విద్యాలయ సంపర్క అధికార శ్రీ శంకరశాస్త్రిగారు ముఖ్య అతిథిగా విచ్చేసిన డా. సరోజ్ బజాజ్ బి. ఎడ్ కాలేజీ ప్రిన్సిపాల్ శ్రీనివాసవ్యాపారిగారు తమ తమ సందేశములను వినిపించిరి. వివిధ పోటీలలో గెలుపొందిన ఛాత్రాధ్యాపకులకు డా॥ సరోజ్ బజాజ్‌గారు బహుమతి ప్రదానము చేసి, మహా విద్యాలయము కొరకు కావల్సిన గ్రంథములను కొనుటకు రు. 1,100/–లు. విరాళముగా నిచ్చిరి. సభాధ్యక్షులు ప్రొఫెసర్ దిలీప్ సింహ్‌గారు రాష్ట్రభాష అయిన హిందీ భాషాభివృద్ధికి భావి ఉపాధ్యాయ, ఉపాధ్యాయినులు తగిన కృషి చేయవలయునని ఉద్బోధించిరి.

శ్రీమతి కామేశ్వరీ ప్రార్థనతో ప్రారంభమైన సభ శ్రీమతి అప్సరా కుమారి కృతజ్ఞతాభివందనము లతో ముగిసినది ఛాత్రాధ్యాపక, అధ్యాపికలు సాంస్కృతిక కార్యక్రమములను ప్రదర్శించిరి.

# గుంటూరు జిల్లా అమృతోత్సవ హిందీ మహాసభలు
## తెనాలి

ది. 18.12.1994



మహాసభల సందర్భంగా ప్రసంగించుచున్న కేంద్ర సభ ప్రధాన కార్యదర్శి శ్రీ అన్నదానం రామస్వామి గారు, హిందీ ప్రచార ప్రదీపిక ఆవిష్కరించుచున్న డా॥ సంజీవదేవ్ గారు, ప్రసంగించుచున్న డా॥ బెజవాడ గోపాలరెడ్డి గారు మరియు ఆంధ్ర సభ అధ్యక్షులు శ్రీ బోయపాటి నాగేశ్వరరావు గారు ఈ చిత్రంలో ఉన్నారు.

Edited Printed andPublished by A. Sankara Sastry on behalf of the D.B.Hindi-Prachar Sabha-Andhra. Khairatabad. Hyderabad-500004.
and Printed at Dakshin Bharat Press, Khairatabad, Hyderabad-500 004.